# శిశుతత్వదీపిక.

గ్రంథకర్త:
కె. హెచ్. వి. యస్. నారాయణగారు,
బి. ఏ. ఎల్. టి.,
సీనియర్ డిప్యూటీ యినస్పెక్టరు ఆఫ్ స్కూల్సు.



పబ్లిషర్సు:
వేంకటరామ్ అండ్ కో.,
హెడ్డాఫీసు—ఏలూరు.

రామా (పవర్) ప్రెస్, ఏలూరు

1929.



(వెల 0- . —0

# FORE-WORD.

I have much pleasure in introducing this little book to the Telugu reading public.

It is one of a series of book-lets published in connection with the celebrations of the national Health & Baby Week. It has a particular significance when special efforts are being made to mould the young mind and to train it to imbibe proper ideas of healthful living. It is very important to form habits from infancy upwards & it is eqally important for all working in the field to have proper understanding of the child-mind in order to be able to train it with discrimination.

This book-let, I take it, is an attempt at placing some dominant ideas on child psychology before the public mind and this is done in a very easy graceful style and in a way that can be grasped by all people. It makes a beginning on a subject which, so far as I know, has not been touched by Telugu literature. It thus serves a very useful purpose in filling a long-felt want. I dare say the author will make further attempts at placing the advanced aspects of the subject before the public.

The public Health Department is obliged to him very much for the help rendered by him in spreading knowledge on Health matters among the public.

**(Sd) T. Lakshminarayana,**
District Health Officer,
Kistna Dt.

# శిశుతత్త్వదీపిక.

## 1. శిశుకల్పనాశక్తి.

చిన్నపిల్లల చిత్తవృత్తులు చిత్రములుగా నుండునని తల్లిదండ్రులకేగాక శిశువులతో నేపాటి సంపర్కము గలవారి కైనను తోపకమానదు. శిశువు లెక్కువుగ నూహాప్రపంచ మందే వసించి దానినే వారి యానందమునకు నాధారము చేసికొనుటచే వారుసుషుప్త్యవస్థయందున్న వారివలెనుందురు వారి చేష్టలు పలుకులు వీని మూలమున ఈ యంశము మనకు గోచరించును. ఇందు వివాదాంశ మెంతమాత్రము లేదు; వారి చిత్తవృత్తులు వివిధగతుల మెలంగుటచే నవి మన పరిశీలనమునకును ఆలోచనమునకును ఆస్పదములుగ నున్నవి.

ఒకపిల్ల యొరులు తీయువఱకును కూర్చుండబెట్టిన చోటనే కూర్చుండియుండును. ఇంకొకపిల్ల తనతల్లి విసుగుకొనునంతటి యల్లరి చేయును. వేఱొక పిల్ల గంతులు వేయకుండ కొంతసేపయిన నుండలేదు. మఱొకపిల్ల వస పోసిన పిట్టవలె వాగుచునే యుండును. కొంద ఱేడ్వకుండ నూరకనే యుండరు. ఇక కొందఱు ఎంత నలిపినను నవ్వుచునే

యుందురు. వేఱొకకొందఱెప్పుడు తీక్ష్ణముగ యోచించు చుందురు. మఱికొందఱు ఆటపాటల మఱిగి బువ్వమాటయే మఱచి తల్లి పిలచినను "రాను, పో" అనుచు నాటదృష్టినే యుందురు.

ఇట్టి భేదములు కానవచ్చినను ప్రతిశిశువు నూహా ప్రపంచమందు కొంత కాలమయిన నుండక మానదు. కాని కొందఱకీయూహ మిక్కుటముగనుండి కొన్ని యేండ్లవఱకును నుండును. సామాన్యముగ శిశువులు తాము చూచుచున్న వస్తువులను యథారూపముగ గ్రహింపరు. పిట్టరూపముగ గ్రహింపరు. పిట్టకథలను వినినప్పుడును చిత్తరువులను చూచి నప్పుడును వారి యందలి యూహలు విజృంభించి వారి నానందమున మునుగునట్లు చేయును. ఈ శైశవస్వభావము కొన్నిపట్టుల నేండ్లు వచ్చినవారియందును గాంచనగును. వారి యెడల నుండు ఇట్టి శైశవస్వభావమును జూచి "కుఱ్ఱతనము" "పిల్లాటలు" మొదలగు మాటలను కొందఱు వాడుచుండుట మన కెఱుకయే.

బాహ్య ప్రపంచమునకు ఊహా ప్రపంచమునకును సంబంధము లేకపోలేదు. బాహ్య ప్రపంచజ్ఞానము ఊహా ప్రపంచజ్ఞానమున కాధారమయి యున్నది. ప్రపంచమందలి వస్తువులను వాని గుణములను మేధస్సు పంచేంద్రియముల మూలమున గ్రహించుచున్నది. ఇట్టి గ్రహణశక్తి మేధస్సు,

నకు మాత్రమే కలదు. దీనికే ఆలోచనశక్తికూడ గలదు. శిశువులకు జన్మకాలమున మేధస్సున నూహాపోహము లేవియును లేక శుభ్ర ఫలకమువలె నుండును. బాహ్య ప్రపంచము పంచేంద్రియములు మేధస్సు నివి ప్రతిశిశువునకు సమానములయి యుండుటచే జననకాల మాదిగకొంత కాలము వఱకు వారి యూహాలు ఒకేరీతిగ నుండునని మన మనుకొన వచ్చును. కాని లోకానుభవము వేఱురీతిని చూపట్టుచున్నది.

సమాన వయస్సుగల పిల్లలను దీపావళినాఁడు బాణసంచాను గాల్చుచోట నిలువఁబెట్టినచో నొక పిల్ల బాణముఁ ఘామ్మని ప్రేలినతోడనే అమితానందమును బొంది గంతులు వేయును. ఆశబ్దమును వినినతోడనే గుక్కపట్టి యేడ్వసాగును మరొకతె. కాని యీపిల్లలకు మతాబుల గాల్చిన పట్టరాని సంతోషము. వీని వైపునకయిన మొదటిపిల్ల చూడక ఘామ్మని ప్రేలు బాణములనే చూచుచుండును. జట్కాబండి పోవుచో దానిని చూచు పిల్లలలో నొకడు గుఱ్ఱము వడిగా పోవుటనుచూచి యాశ్చర్యపడును. ఇంకొకడు ఆకుపచ్చని కప్పుపై వేయబడిన చిత్రమునే అవలోకించుచుండును. వేరొకడు చక్రభరణమును దిలకించుచు దానిశబ్దమునే వినుచుండును. ఒక్కొకబాలున కొక్కొక యింద్రియము సూక్ష్మముగనుండును. ఆయాయింద్రియముల ద్వారా బాలురు జ్ఞానమును త్వరలో గ్రహింపగలరు.

మేఘములను జూపి మూడేండ్ల వయస్సుగల పిల్లలనిది యేమి యని యడిగినచో వారు పొగ యనియు జెండాయ నియు బూచివాఁడనియు వివిధనామముల బ్రయోగించి చెప్పు దురు. ఇటుల నొక్కవస్తువు పిల్లలయందు వేర్వేఱు భావము లను అపేక్షలను ఊహలను జనింపజేయుచుండును.

అయినను పిల్లలందఱకును సామాన్యముగ బ్రీతిని గలుగ జేయునవి అనేకము లున్నవి. 'అనఁగా అనఁగా ఒక రాజు, ఆరాజున కేడుగురు కొడుకులు' ఈకథను ఎన్ని మారులు చెప్పినను శ్రద్ధగా విని, చీమచెప్పు జవాబు వద్దకు వచ్చునరికి నవ్వకుండ నుండగలిగిన పిల్లను నేను జూచియెఱు గను. ఈచిన్నకథలో నెన్నో భావప్రదర్శనము లిమిడి యున్నవి. ఎన్నియో వేర్వేఱు ఊహలను త్వరితముగా పుట్టించు విషయము లిందున్నవి. రాజుతో ప్రారంభమయి చీమతో అంతమయినది ఈకథ. ఈమధ్య ఎన్నివస్తువులు కార్యములు గుణములు ప్రదర్శింపబడినవో! ఎక్కువ విషయ ముల గ్రహించు నభిలాష పిల్లలకుండుటచేత వారు ఒకదాని మీదనే బుద్ధిని నిలుపలేరు. వేర్వేఱు విషయముల నొక దానివెంట నొకటి ప్రదర్శింపబడుటచేత వానిని బాలుడు చులుకుగా గ్రహించును. ఈచులుకుదనమే కుతూహలము పుట్టుటకు కారణము.

శిశువుల యూహాలు వారు గ్రహింపబోవు వస్తువుల తత్త్వమును బట్టియేగాక వారివారి నైజగుణములను బట్టికూడ నుండును. ఇట్టి స్వభావము కొంతవఱకు పైతృకమైయుండును. ఇంతియేగాక యేదైన నొక వస్తువును శిశువులుచూచినపుడు తత్కాలమున వారి మనస్సునందే యేయూహాలు ఆక్రమించి యుండునో వానినిబట్టి కూడ ఆ వస్తువుల గుణములను వారు గ్రహింతురు. వయస్సువచ్చిన వారియెడల గూడ నీవిషయము వర్తించును. అర్ధరాత్రివేళ వీధివెంబడి హోరని వర్షము కురియుచున్నపుడు హరిశ్చంద్ర నాటకమును జూచి యింటికి వచ్చుచున్నవానికి దూరమున నున్న మ్యునిసిపల్ దీపము కొఱివిదయ్యమువలె కనబడవచ్చును. ప్రియమిత్రునిరాకకై నిరీక్షించుచు కూర్చుండియున్న వాని క్షేమమాత్రము తలుపు చప్పుడయినను తనస్నేహితుడే వచ్చెనని యనుకొనునుగదా! కొందఱు బాలురు సుందరమై యాహ్లాదకరమగు వస్తుచయముతోనే దినమంతయును నాడుకొనుచు నానందించుచుందురు. మఱికొందఱు సాధారణముగ చీమ మొదలగు వానిని హింసించుటయందాసక్తి గలిగియుందురు.

పిల్లలయందన్నిటికంటెను ఎక్కువ అద్భుతముగ మనకు గనిపించునది వారి కల్పనాశక్తి. దానినే కవిత యనవచ్చును. "ఏనాడీశ్వరుడు ప్రపంచమును నిర్మింప సంకల్పించెనో ఆనాడే కవిత్వ ముద్భవించినది." ఆకవితా శక్తి

మెండుగానున్న శిశువులయందు దేవుడు రూపునంది యున్నా డని చెప్పుట యుచితమేకదా!

శిశువులకు వారి చుట్టుపట్టులనుండు వస్తువులను గూర్చి నేర్చుకొనవలయునను కాంక్ష మెండు. మనకు చెప్పుటకు ఓపిక శిశుమానసవృత్తిని గ్రహింపశక్తియు నుండవలయునేగాని శిశువులు "అదియేమి ఇదియేమి?" అని విసుగు విరామములేక ఆశ్చర్యమును ప్రకటించు చూపులతో ప్రశ్నించుచునే యుందురు. ఇంద్రియముల ద్వారా యెఱుకపడు వస్తుసముదాయమును గుఱించి నేర్చుకొను కాంక్షతోబాటు క్రొత్త వస్తువులను వెదకికొను కాంక్షకూడ నెక్కువగ కలుగును. అందుచేతనే పిల్లల యింద్రియము లెక్కువ చుఱుకుగానుండును. ఇంతియేగాక నొక యింద్రియముచే నెఱిగిన దానిని మఱియొక యింద్రియము మూలమున నెఱుగవలయుననికూడ వారు ప్రయత్నించుచుందురు. చూచినవానినెల్లను తాకబోదురు. తాకినవానిని రుచిచూడబోదురు. డక్కా నొక దానిని మనచేతిలో నుండుట పిల్ల చూచిన దాని నందికొన జేతులజాచును. తనచేతుల దానిబట్టికొని నోట బెట్టుకొనును. పిదప చేత తట్టిగాని నేలపై గొట్టిగాని శబ్దమును వినజూచును. వయస్సు వచ్చినకొలది లోక వ్యవహారములయందు తగిలి యుండుటచేత మనమున నిట్టి కోరిక యడుగంటును. పసిపిల్లలకు లోకమునం దన్నియు సమానమైన యాశ్చర్యమును

గొల్పును. ప్రతివస్తువు పిల్లల వాంఛను తీర్చుటయందు వారి కుపయోగించును. కనుక నవియన్నియును వారికి చెలికాండ్రే. వానినన్నిటిని శిశువు ప్రేమించును. రాను రాను ఐహికోప యోగమును బట్టి వాని వేఱుచేయ నుపక్రమించును.

కవియందు ప్రజ్వలించు ప్రేమ శిశువులందు నిష్కళంకమైతనరుచున్నది. క్రమక్రమముగా పరవస్తువులనుండి ప్రేమను తొలగించి తన్నుదా ప్రేమించుకొననేర్చుకొనును. ప్రేమపూరితములగు హృదయములు గల యిట్టి శిశువుల చుఱుకుదనమును గ్రహించి యానందించు మహాభాగ్యమును విడనాడి అల్లరిచేయుదురను మిషచే వారి నెత్తుకొని యాడించుటకై నిరంతరము దాదులకు ఒప్పగించు తలిదండ్రులను జూచిన జాలిపుట్టక మానదు.

శిశువు వస్తువులను గ్రహించునపుడు వానిలో వానికేదేని సంబంధముండిన దాని శీఘ్రముగ కనిపెట్టును. ఒకవేళ సంబంధమంతగా లేకపోయినను దానిని గొంతవఱకు కల్పించుశక్తికూడ శిశువునకు కలదు. ఇట్టిశక్తి శిశువునకు నైజమై యుండవచ్చును. లేక యావశ్యకతనుబట్టి యది గలుగవచ్చును. పరస్పర సంబంధముగల వస్తుచయమును జ్ఞప్తియందుంచుకొనుట, అట్టి సంబంధము లేనివానిని గ్రహించుటకంటె మిక్కిలి సులభము. ఇంతియేగాక ఏదేని ఒకవస్తువును దెలిసికొనిన పిమ్మట దానికి సంబంధించినవానిని గ్రహిం

చుట సులభము. కనుక అట్టి సంబంధమును గలుగఁజేసి యయి
నను లోకమందలి పదార్థముల నొకదానివెంబడి నొకదానిని
తెలిసికొన శిశువు ప్రయత్నించును. పెద్దఉల్లిపాయను జూచి
యది బొంగరమని తలచి త్రిప్పుచుందురు. ఉసిరికాయలతో
పిల్లలు గోలీలయాట నాడుదురు. వస్తువుల యాకారమందలి
పరస్పర సంబంధమునుబట్టి వాని గుణములందును అట్టి సంబం
ధము గలదని శిశువూహించును. శిశువు బ్రహ్మజెముడు
పొదనుజూచిన నది జడిసికొనును, దీనియందు క్రౌర్యభావము
శిశువునకు స్ఫుష్టపడునేమో!

క్రొత్తవస్తువు నేదేని మనము చూచినపుడును దాని
యందునిదివఱకు మనము చూచియున్న వస్తువునుబోలియుండు
భాగమే మన మనస్సునకు మొదట తట్టును పిమ్మట తదితర
భాగములు పొడగట్టును. అటులనే శిశువులయందును. కాని
వస్తువులందలి వ్యత్యాసమును బరికించు శక్తి శిశువులకంతగా
లేకుండుటచేత పలువస్తువులను వారొక్క పేరిటనే పిలుచుట
తటస్థించును.

శిశువు తెలిసియుండు వస్తువులు కొన్నియే యైయుం
డును. కాన నది క్రొత్తగా గ్రహింపబోవు వస్తువునకును-
పూర్వమెరిగియున్న వానికిని సులభముగ సంబంధ మేర్పఱుప
గలదు. వయసు వచ్చుకొలది శిశువు గ్రహించిన వస్తువుల

సంఖ్య హెచ్చుచుండును గాన ఇట్టి పోలికలను గనుగొనుట యంతగ సాధ్యము కాకుండును.

శిశువులకు వస్తువులలో గొన్ని వాని యాకారముచేత గాని రంగుచేతగాని, రుచిచేతగాని యింపుగొల్పి వారి మనముల నాకర్షించును. వానిని కుతూహలముతో ప్రథమ దర్శనముననే గ్రహింతురు. ఇట్టివానితో సంబంధము గల్పించి మిగిలినవానిని గ్రహించును. వస్తుజ్ఞానము వృద్ధియగుటకు నిది యొక మార్గము.

ఇట్లు గ్రహించిన క్రొత్తవస్తువునకు వచ్చియురాని మాటలతో పేళ్ళుపెట్టినప్పుడు శిశువు తా నిదివఱకు గ్రహించిన యేవస్తువుతో దీనిపోలిక మెండుగ నుండునో దానిపేరనే నూతన వస్తువును పిలుచును. ఇట్టిపేర్లు చాలవరకు మిక్కిలి యుచితముగ నుండును. కవులు వర్ణనలలో నుపయోగించు నలంకారములు తమంతటతామె అప్రయత్నముగ శిశువులందు వెలువడుచుండును. సంధ్యాసమయమందు నాకాశమందున్న యెరుపు రంగును జూచి జేగురుమన్ను అని పిల్ల నుడివి యెవరచ్చట దానినుంచిరో యని యోచించును.

మూడునాలుగేండ్ల వయసు గల్గిన పిల్ల పాతవస్తువునకును క్రొత్తగజూచిన వస్తువునకును భేదమును గమనించి యీ రెండు వస్తువులు నొకటే కావనియు క్రొత్తది ప్రాత దానిని బోలియున్నదని గ్రహించి యుపమాలంకారము

నుపయోగించి మాట్లాడుచుండును. తెలుగు అక్షరములలో "అఆ"లను తొట్టిపడవలని పిల్లలు పిలుచుట కలదు. కొంత కాలమయిన పిమ్మట "అఆ" లు తొట్టిపడవలవలె నున్నవని చెప్పుదురు. కొన్నివస్తువులను సంజ్ఞలను జంతువుల పిలుచు నట్లు పేళ్ళుపెట్టి పిలుచుటయు కలదు. "ఒ ఓ" లను కొంగ లనియు, "ఋ" అను అక్షరమును రైలుబండి యనియు కొందఱు పిల్లలనుట వినియుందుము. "ఱ" ను "బండిఱ" అనుటకు కారణ మూహింపవచ్చును.

తరగతులుగా వస్తువులను విభజించి యేర్పఱచు నవస్థ తరువాతిది. ఒక్కొక్కప్పుడు శిశువులు కనిపెట్టు పోలికలు మిక్కిలి దుడుకుగా నుండును. నక్షత్రములజూచి దేవుని కుంపటినుండి వచ్చు నిప్పుకణములని ధైర్యముగ జెప్పుట శిశువుయొక్క గుండె నిబ్బరమును జాటించి మన కాశ్చర్య మును గొల్పదా! వర్షము కురిసి వెలిసిన పిమ్మట చెట్ల యాకుల నుండి నీటిబొట్లు కారుట జూచి చెట్లు ఏడ్చుచున్నవని శిశువుభావించి కరుణరస ముట్టిపడుచూపులతో దానివైపు దృష్టినిల్పి చెట్టుయొక్క విచారమును బాపు తలంపుతో నేల యేడ్చుచున్నదని ప్రక్కనున్నవారినడుగుట గలదు.

అర్థాలంకారములే కాకుండ శబ్దాలంకారముల నయి తము పెక్కుమంది శిశువు లుపయోగింతురు. ఇతరులు వాని నుపయోగించిన గ్రహించి యానందింతురు. పదములనాదిరి

పదములఁగూర్చి సందర్భానుసారము ప్రయోగించు శక్తిగూడ వారికిగలదు. "దాయిదాయి రావే!" అన్న పాటలో "వెండిగిన్నె తేవె, అని తల్లి చెప్పుచుండగా మూడేండ్ల పిల్ల యొకతె "మొండిచేట తేవే"* అని చెప్పి నవ్వెను. వెండిగిన్నె కంటె మొండిచేటయే ఆపిల్ల తరుచు చూచుచుండుటచే గాబోలు నట్లనెను! "మంగళహారతీయవే" అని పాటఁబాడుచుండగా మజ్జిగనమ్ము మనిషి లోనికివచ్చుటను జూచి "మజ్జిగవా డడుగోనే" అని వెనుకపాటతో గలిపిపాడెను.
*మూడు సంవత్సరములు గడచినపిల్ల.

మత్తకోకిల కవిరాజ విరాజితము తరల మొదలయిన వృత్తముల మనము చదువునపుడు పిల్లలతిజాగ్రత్తతో వానిని వినుచు నక్రమముగ లయవేయుచు దల నూచుచు గనుపాపల గదల్చుచు నృత్యముచేయుటగూడగలదు. కొన్ని అక్షరముల ధ్వని పిల్లల నెక్కువగ నాకర్షించును. 'లాంతరు' అనుటకు బదులు 'తీంతరు' అనుట కొందఱు పిల్లలకు సులభముగ కనిపించును. కొందఱు 'చీకటి' కి 'చీటకి' అందురు. అట్లు కాదని ఎంతచెప్పినను ఆపదములనే యుపయోగింతురు. ఎందుచేతనో!

కీచుపిట్టయని వినుగుచేత నొకపిల్లను పిలిచిన నది ఎంతయో సంతసించి ఆమాటనే తరచుగాకొన్నిరోజులవఱకు ఆనందముతో నుచ్చరించుచుండుట నే నెఱుగుదును. "కీచు

కీచు" మని ధ్వని ఈపదమున నుండుటయే దీనికి కారణమయి యుండనోపు.

ఊహాప్రపంచమందలి తోరణపలు కొన్నిమన కగమ్యగోచరములని మన మొప్పుకొనక తప్పదు. ఒక మనిషియొక్క పేరును మనము వినినప్పుడును పుస్తకములందు చదివినపుడును వానియాకారము మనస్సునకు స్ఫురించును. కాని యందరికిని ఒకేవిగ్రహముస్ఫురింపక పోవచ్చును. శిశువులయందింతకంటెను వైపరీత్యములు పొడగట్టును. శబ్దముల వినిన రంగును రంగును చూచిన రుచియు, రుచినిబట్టి భావమును శిశువుల మనస్సులకు దోచునని వారివిషయమయి తెలపోసిన వారెఱుగకపోరు. పూర్వవస్తువుతో సంబంధము కలుగజేయు శక్తియే యిట్టి యూహాలకు గారణమయి యుండవచ్చును.

ఒకొక్కప్పుడు శిశువులందు కల్పనాశక్తిమితిలేనిదయి యుండి వారల భ్రమింపజేయును. ఒకపిల్ల ఆర్ద్రపురుగును జూచి వానిరంగునకచ్చెరువంది ఆనందాబ్ధిని మునిగి భ్రమించి దాని నోట వేసికొనెను.

ఇట్లు ఊహాప్రపంచమందు విచ్చలవిడిగ సంచరించు శిశువులజూచి మనమే యానందమును బొంద, స్వయముగా ననుభవించు శిశువుల యానందములకు మేరయుండునా? వారికి వయసు వచ్చినకొలది ఐహికబంధము లెక్కువయి బిగువగును. వారిని ఊహాప్రపంచమునుండి తొలగించి ధనము,

కీర్తి, సౌఖ్యము వీనిసంపాదనమందె వారిమనస్సును లగ్నము చేయించును. బ్రదుకు తెరువుల వెదకుటయందు నిచ్ఛ ఎక్కువగును. కఠినమైన ప్రపంచవ్యవహారముల నెఱిగి వాని నాచరించు వారలతో సాంగత్య మెక్కువైన కొలది శైశవము నందలి కల్పనాశక్తి క్షీణించును.

## 2. శిశుక్రీడా పరత్వము.

శిశువుల కందఱకు వారిపుట్టుకతోడనకొన్ని సామాన్య లక్షణము లుండును. అందు చుఱుకుదనము విశేషముగా నుండుటొకటి. ఈకారణముచేతనే మిక్కిలి పసి శిశువులందును అవయవచలనమును జూచుచున్నాము. కొన్ని వారములు పెరిగిన పిల్ల యయినను కాళ్లను చేతులను కదల్చుచుండును. కాని అది కదల్చవలెనను ఉద్దేశ్యముతో కదల్చదు; దానిలో నిమిడియున్న చుఱుకుదనము పైకుబికి అవయవ చలనపూర్వకముగా మనకు తెలియుచున్నది. తనకాళ్లు చేతులు కదలుచున్న శిశువునకు మిక్కిలి సంతోషము. మన మాకదలికకేమాత్రమాటంకము కలుగజేసినను అది యేడ్చుచు తన యనిష్టతను జూపును. తిరుగ ఆయాటంకమును దీసివేసిన తోడనే ఏడ్పుమాని కరపాదములను విచ్చలవిడిగ గదల్చుచు నానందించు చుండును.

రెండు మూడు మాసములు వచ్చినపిమ్మట నో చేయుట గొంతవరకు దానిని బట్టుపడును. అప్పుడు హల్లులను "త". "ప", మొదలయినవానిని తఱచుగ రించుచు నాడుకొను చుండును. అక్షరముల నుచ్ఛ నప్పుడు కలుగుధ్వనివలన దాని చుఱుకుదనమును ఐ కొకమార్గము కలుగుటచేతనే శిశు వట్టిధ్వని జేయుచుం ఇందు శిశువునకు నియమితోద్దేశమేమియు నుండదు.

రమారమి సంవత్సరము గడవనుండు శిశువు ఒకి నుండి మరియొకచోటునకు బోవ గొంతవఱ కలవడియుం ఈశక్తిని ఆధారముగ జేసికొని దానినిప లువిధములప ఱులు కదల్చియు. ఆవస్తువును నేలపై గొట్టి అట్లు చేయ కలిగిన శబ్దమున కానందించియు, నాడుకొనుచుం ఇప్పుడు శిశువు యొక్క అవయవచలనము పూర్వము విచ్ఛలవిడిగ నుండదు; దానిని కొంతవఱకు శిశువు తనః చేసికొని యుండును. శరీరము, కన్ను, చెవి మొదల యింద్రియములు చుఱుకుగా పనిచేయుటయే యీ ం శిశువుల కానందము. "అక్క", "అమ్మ", "తా "అత్త",—ఇట్టి శబ్దముల నుచ్ఛరించి ఆధ్వనివిని య దింతురు. ఇదియే వారియాట.

శిశువులకు భావనాశక్తియు కల్పనాశక్తియు మిక ముగనుండి మనము గ్రహింప కష్టముగ నుండుమార్గ

వారిని సంచరింపజేయును. శిశువులందలి యిట్టిశక్తి యేమాత్ర మయిన క్రియారూపమున స్పష్టపడినపు డాశిశు వాడుకొనుచు న్నదని యందుము. "మేము బువ్వాలాట ఆడుకొంటాము" అని శిశువు లనుట మన మెఱిగినదే. ఇట్టి శిశువులయాట లందు చాలవఱకు కల్పనముండును. కొంతవఱ కవి ప్రపంచ ముతో సంబంధించి యుండకపోవు.

శిశువుల కెవరయిన నాటల నేర్పింపవలెనా? ఒకవేళ నేర్పినను అవి వారికి రుచించునా? వారివారి యూహానుబట్టి కల్పనా సామర్థ్యమునుబట్టి శిశువులే యాటల నేర్పరచుకొం దురు. అవియే వారికాహ్లాదకరముగా నుండును. శిల్ప, చిత్ర కారుడు, కవి—శిల్పము, చిత్తరువు, కావ్యముల మూలమున వారి 'కళ' నెట్లుచూపుదురో యట్లే శిశువులును వారియాటల మూలమున వారియందలి కళానైపుణ్యమును స్పష్టపఱతురు వారి మనస్సున కామోదము కలుగజేయునూహాను తగురీతిని తగురూపమున జూపుటకు వారలందు మిక్కిలిపోలిక గలదు. ఆరూపములలో ఆటముఖ్యమయినది. ఆటయందు దృష్టినుంచి ఆడుచున్న శిశువున కింకేమియు గోచరింపదు. ఆకలికూడ బాధింపదు. తనయాటయందు తనకు తోడ్పడువస్తువులేయెప్ప టికి తన స్నేహితులు, తన సర్వస్వము. తనయూహాప్రకారము ఆడుకొనుటయందే సర్వవిధముల ప్రయత్నించును.

ఎడమచేతినిదొప్పగాపెట్టి అందుండి దేనినో కుడిచేతితో తీసినట్లు నటించి చిన్నస్తంభముపై పూయుచుండ కెంజేండ్ల

న్నరపిల్లను చూచితిని; కుంకుమ బరణినుండి కుంకుమము తీసి యొకరికిబొట్టుపెట్టుట శిశువుఉద్దేశము. దీనినే పైకి ఆటరూపమునజూపుచుండెను. ఈయాట యాడునపుడు కుంకుమబరణి లేదనితలచి ఆటనుమానివేయునా ? లేక దానికై ప్రయత్నించునా ? అది లేకపోవుట ఆటంకమా, లోపమా ? తన కందుబాటులో నున్నవస్తువులనె తనయాటలో కావలసిన ఉపకరణములుగాను, పాత్రలుగాను భావించి తన యూహను వెల్లడిచ్చును. కఱ్ఱనుగుఱ్ఱముగా భావించిపిల్లలాడుకొనుట గలదు. చిన్నబల్లకు త్రాడుకట్టి దానిని బండి యని తోలుచుందురు రెండుగోడల మూలను ఇల్లుగా జేసికొందురు. పరిస్థితులనెల్ల వారి యాట కనుగుణముగ నుండువస్తువులుగభావించి యాటలాడుకొందురు. ఆయాటమధ్య ఆయాపరిస్థితులు కేవలము తామనుకొను వస్తువులే యని గట్టినమ్మకము. ఇట్లు శిశువులు తమ యాటయందే తాము లీనమయి, పరిస్థితుల యాటంకమును వారి భావనాదార్ఢ్యముచే జయించివానిని దోడ్పడజేసికొందురు. ఒక్కొకప్పుడు పరిస్థితులకనుగుణముగ తనయాటలు కొంతవఱకు మార్చుటయును గలదు.

ఈవిధమున భావనాశక్తిచే ప్రేరేపింపబడి రూపకప్రదర్శనమందు పాల్గొనుటకు శిశువులకు ఆటలయందుగల యమితోత్సాహమే కారణము. పిల్లి, కుక్క, వీని పిల్లలకును కొంతవఱకు భావనాశక్తి యున్నప్పటికిని అవి శిశువులవలె

పలుపాత్రల స్వీకరించుకొని యాడుకొన జాలవు. గుడ్డపేలికను చూచి దానితో చెలగాటలాడుట కుక్కపిల్లకును, పిల్లిపిల్లకును సహజమే. కాని కుక్కపిల్లలింకొక జంతువువలెగాని, మనుష్యునివలె గాని నటించి యానందింపలేవు. ఇతర మనుజుల యొక్కయు, జంతువులయొక్కయు, చేష్టలను జూపి వానివలె నటించుట శిశువులకే చేతనగును.

కేవలమన్యరూపధారణముశిశుస్వభావమునకు చెల్లును. గుడిలోనిదైవ ప్రతిమ, మహారాజు, రాణి, దుకాణదారుడు. చాకలివాడు, అది యిది యననేల? ఉత్కృష్ణ జీవనముగల వారిని అత్యల్పజీవనము గలవానిని కడకు అచేతన పదార్థముల రూపమునుగూడ శిశువు భావమున ధరించి యాడును. పువ్వుల నమ్మువానివలె నొకప్పుడు కేకవేయుచు నఱచి యింటనున్న యందరిని జేర్చి,

> 'పువ్వులమ్మ పువ్వులోయి!
> మేలుగులాబీ పువ్వులోయి!
> ఎంతోపెద్దవి పువ్వులు
> బాగావిడిచిన పువ్వులు
> కొనరమ్మా యీ పువ్వులు'

అని యఱచును.

ఇక కొంతసేపటికి గుడ్డలమూట నొకదాని బుజాన వేసికొని, చాకలివానివలె బట్టల నొప్పగించును. మఱియొక కొంత

సేపటికి చేతుల మీదను మోకాళ్ళ మీదను ప్రాకుచు 'అమ్మా' 'అమ్మా' యని ఆవులఱచునట్లు అఱచును. అట్లు చేయునపుడు దగ్గఱ మనుష్యులనుగాని వస్తువులనుగాని పొడవ బోవుటయు గలదు. చిన్న చీమయయిను కుట్టబోవుట గూడ కొందఱు శిశువులందు చూచియున్నాము. మూఁడు సంవత్సరముల యీడుపిల్ల తన జతగాండ్రతో, "నేను నాన్నని, కచేరినుంచి వస్తానట మీకు మిఠాయి తెచ్చిపెడతానట." అని చెప్పుచుండగా వింటిని. శిశువుల భావమున బొందుటకు ప్రపంచమందెవ్వరుగాని, యేవస్తువుగాని అసాధ్యమైనదికాదు.

పసితనమందు పిల్లలకు వస్తుచలనమం దెట్లు ఆసక్తియు ఆనందము కలుగునో, అటులే రూపకముల ప్రదర్శించుట యందును గూడ వారు త్వరితకాలములో తమ రూపముల మార్చుచుందురు. ఆవువలె కొంతసేపు నటించిన ఆ క్రియ యందుత్సాహముతగ్గి చాకలివానిగా మాఱును. ఒకేదానిపై దృష్టి నిలిపియుంచుట శిశువులచేత గాదు. కాని, వారెదిగిన కొలది, అయిదారు సంవత్సరముల వయసు రాను వారు దిన మంతయు ఒకేరూపమున నున్నట్లు భావించుకొని నటించు చుందురు. "అక్కా నేను బొమ్మలను అమ్మినానే, ఆ రోజున నీకిచ్చిన బొమ్మ యెక్కడపెట్టావు?" అని యొక పిల్ల యుడి గెను. ఆపిల్లయే, "పాపాయీ, ఇవాళ నేను నీకు అమ్మని, నీకు బువ్వపెట్టి ఉయ్యాలా ఊపుతానే," అని పదినెలల

పిల్లతో చెప్పుచుండెను. ఒకరోజున, ఆదినమంతయు 'పాపా యి'కి సంరక్షణ చేయుటలోనే గడపినదా పిల్ల.

పైని చెప్పినట్లు మార్పు అనిన పసివాండ్రకు మిక్కిలి ఇష్టము ఈకారణముచేతనే యయ్యియుండవచ్చును. వారుఅన్య రూపములధరించినట్లు భావించి నటింతురో వారెప్పుడురూపము నుమార్చి వేఱురూపమును పొందినట్లు ఊహింతురో, అప్పుడే వారిపరిస్థితులును నూతనరూపమునందు వారికుచితమని తోచు నట్లు మాఱుచుండును. వారిభావమందు ఏదయిన పనిచేయవలె ననియు, అట్లు చేయుటకు వీలుకానపుడు, ఆయా చేతల నటించుటయు మిక్కిలి పసిపిల్లలకుకూడ స్వభావమే. ఏడాది లోపు పిల్లదగ్గఱనున్న పాత్ర నందికొని దానిని నోటియొద్ద బెట్టుకొని అందేమియు లేకున్నను త్రాగుట నభినయించును. వర్షము కురిసి చిన్నగుంటలో, కొంతనీరు చేరినది. దానిని చూచినతోడనే చెఱువుజ్ఞాపకమువచ్చినది కాఁబోలు. పిమ్మట చెఱువునొద్ద బట్టల నుతుకుట స్ఫురించి యుండనోపును. సుమారు మూడున్నర సంవత్సరముల పిల్ల చిన్న గుడ్డను గుంటవద్దకు తీసుకొనిపోయి దానిని ఉతుకుచున్నట్లు నటించును. పుల్లను తీసికొని మరియొక చిన్నపుల్లతో ఫిడేలు వాయించినట్లు గీయుచు ఏదియోపాటపాడుచు నాడుకొనును.

పిల్లలకు పరులను చూచి వారి రీతులును బాగుగ గమనించి ఆరీతుల నభినయించు శక్తియు నాసక్తియు ఎక్కువగ

నుండును. పిల్లలయాటలలో చాలవఱకు అభినయ ముండు నను మాట వాస్తవమే; కాని తామట్లు అభినయించు చున్నట్లు వారెఱిగియుండరు. మొదట కొంతకాలమువఱకును అట్లు వారికి తెలిసిన యెడల ఆటల యందలి సార మంత గ్రహించి వారంతగ నానందింపరు. అయినను ఈ సందర్భ మున నింకొకటి యోచింపవలసి యున్నది. గాజుల నమ్ము వానివలె నటించు పిల్లవానికి వానివద్ద నిజమయిన గాజులు లేవనియు, తానిచ్చునవి గాజులు కావనియు, తాను పుచ్చు కొనునవి నాణెములు కావనియు తెలియకుండునా! వయసు కొంతవచ్చినవారికి తాము ఆట నాడుచుంటిమనియు నిజ మయినచేత చేయుట లేదనియు తెలియును. ఇట్టిపిల్ల లేదయిన వారితో వారే, అనగా ఒంటరిగా నాడునప్పుడు పెద్దవా రెవరయిన చూచుచున్నట్లు తెలిసినచో నవ్వి సిగ్గుపడుదురు.

పిల్లలు ఆటలాడుట వారి యానందము కొఱకే గాని ప్రదర్శనము గావించి యొరులమెప్పు వడయుటకు గాదు. తన యూహాలకు సరిపోవునట్లు వస్తువుల నమర్చియుంచి వానితో తాము సంబంధము కల్పించుకొని వానిని తమకు తోడ్పడు నటులు చేసికొనుటయే వారి యానందమునకు కారణము.

చిన్నపిల్ల లిట్టి నాటకముల నాడునపుడు నియమిత రంగములతో గాని యుపకరణములతోగాని వారికి బనిలేదు. కొంతమంది పిల్లలు కలిసి యాడునపుడు తగుపాత్రధారుల్ను

చురు. అట్లు లేకున్నను నాటకమున కభ్యంతరము కలుగ నేరదు. ఏలన ఒక్కశిశువే చుట్టుప్రక్కలనున్న వస్తువులలో కొన్నిటిని పాత్రధారులుగా భావించి మఱికొన్నిటిని వలయు నుపకరణములుగా నుపయోగించి తానే సూత్రధారుడయి నాటకమంతయు జరపుకొనును. ఇట్లు ఒకేపిల్ల నాటకమంతను ఆడుటకు కల్పనాశక్తి మిక్కుటముగా గావలెను. తానొక్క తెయే ఒక మూల కూర్చుండి రెండు పాదములు పొయ్యివలె దగ్గరగాజేర్చి దానిపై "ఉత్తుత్త" బువ్వను వండి "ఉత్తుత్త" అతిథులకు వడ్డించి భోజన మిడుట చూచియే యుందురు. కేవలకృత్రిమచేష్టలు చేయుట యొంటరిగనుండుపిల్లలకు సహా జము; వీనికై ఎక్కువ భావనాశక్తియు, చుఱుకుదనము, తెలి వియును కావలెను. లేకున్న అచేతనపదార్థముల తన మిత్రులుగా భావించి వానితో మాటలాడుచుండుట సాధ్య మగునా!

బాహ్యప్రపంచమందు శిశువులకు కనబడని వస్తువులను పరిస్థితులను వార లూహాప్రపంచమునుండి గ్రహించి వాని లోపమునుదీర్చికొందురు. కొంతకాల మట్లుజరిగినపిమ్మట 'ఉత్తు త్త' ఆటలయందాసక్తి తక్కువయి కేవల వస్తురూపములయిన బొమ్మలనేచెలికాండ్రగాజేసికొని వానితోనాడుకొనుచుందురు.

బాలురును బాలికలును బొమ్మలను తమమిత్రులవలె తలంచిమిక్కిలి ప్రేమింతురు. ఈయవస్థలయందు వారికిబొమ్మలే

ప్రపంచమందెల్ల ముఖ్యమైనవి! బొమ్మలతో నాడుచు తన్మయత్వమును జెంది ప్రపంచమునే మఱచియుందురు.

కొంతబరువున్న చిన్న రాతిని చంకబెట్టుకొని దాని ముద్దాడుటచూచి యదియేమని మూడుసంవత్సరముల యీడుగలపిల్లనునే నడుగ పాపాయి, 'అయ్యో నీకు తెలియదా?' అని బదులు చెప్పెను. ఆరాయి నిజముగ పాపాయియనియు తన భావనయే నిజమనియు ఆబిడ్డ కెంతనమ్మకమో! రాతిని కాలిమీద పడవేసుకొనునని భయముచేత, అంగడికి బోయి చందనపుబొమ్మను, చక్కటిబొమ్మను, గొనిదెచ్చి, బిడ్డ కిచ్చితిని. ఈబొమ్మను చూచుటతోడనే అధికోల్లాసము జెంది తన (రాతి) పాపాయిని గూటిలోనుంచి చందనపబొమ్మను చేతబట్టుకొని కొంచెము సేపుమాత్రమే గంతులు వేయుచుండెను. పిమ్మట నీబొమ్మను వదలివేసి తన (రాతి) పాపాయినే చంకబెట్టుకొని తిరుగుచుండెను. శిశువులకు తా మేర్పఱచుకొనిన బొమ్మలయందే ఎక్కువప్రీతి ఎక్కువ విశ్వాసము కాబోలు!

ఈ 'పాపాయి'కి ప్రాణ మున్నదనియు తనకున్నయూహలు, ఇష్టానిష్టములు, భావములు, చేష్టలు ఉండుననియే బిడ్డకు పరమవిశ్వాసము. ఆ రాతినితనబుగ్గవద్దనిడుకొని 'నన్ను ముద్దెట్టుకోఅమ్మా' అనును. తనకు నిద్రవచ్చునపుడు, పాపాయికి, కూడ నిద్రవచ్చునని భావించి "పాపాయీ నిద్ర వస్తుందా? బజ్జో" అని చెప్పి దగ్గఱ నెవరయిన శబ్దము

చేయుచుండినవారిని జూచి "నాపాపాయికి నిద్రవస్తుంది; ఇక్కడ అల్లరిచేయకండి! అని ఆజ్ఞాపించును. "పాపాయి"కి సౌఖ్యమును గూర్చుటకు ప్రపంచమందెల్లరును బాధ్యులని బిడ్డ యుద్దేశము. ఆపాపాయికి స్నానె పట్టించి నీళ్లుపోయును; బువ్వబెట్టును, తనప్రక్కనే పరుండబెట్టుకొనును, పాలిచ్చును; దానితోనే దినమంతయు గడపుచుండును. చెలికాండ్రతో గూడ నాడునప్పుడును "పాపాయి"ని గూడ నాటలో నొకరి నిగా చేసికొందురు.

తన సౌఖ్యమును చూచుకొనుట కంటె, "పాపాయికి సౌఖ్యమును గూర్చుటయే ముఖ్యము, బిడ్డకు తండ్రి కచ్చేరికి బోవునప్పుడు "నాన్నా! నాపాపాయికి మిఠాయి తెచ్చిపెట్టు మఱచిపోకు" అని యెంతోచెప్పును. గచ్చునేలపై పాపాయికి గుడ్డలను పఱచి, పక్కనమర్చి దాని నుంచును. దానిప్రక్కను తాను వట్టి గచ్చుపైననే పండుకొనును.

ఇట్లు ప్రేమాతిశయమును జూపుచున్నను, ఒకొక్కప్పుడు "పాపాయి"పై కసరుకొని శిక్షించుటయూ కలదు. ఒక రాతిముక్కను దెచ్చి దానిని బొమ్మగా భావించి దానిని నిలువబెట్టి ప్రయత్నించినను ఆరాయి క్రిందకు బడిపోవుచుండెను.

అప్పుడు బిడ్డకు మిక్కుటమగు కోపమువచ్చి "నువ్వు చెప్పినమాట వినవు, నిన్ను ఎత్తుకోను, పో' అని తాను లోనికి

బోయెను; కాని దాని తలపు ఈరాతిపైనే యున్నది కాబ
లును. తిరిగి ఎంతసేపటిలో వచ్చి "ఏడవకమ్మా, ఏడవకు
ఎత్తుకుంటానులే" అని తన పశ్చాత్తాపమును వెలిపుచ్చి
బొమ్మను ఊఅడించెను.

శిశువులందెల్ల గాన్పించు నిట్టి విభ్రమమునకు వా
కల్పనాశక్తియొక్క ఉత్కృష్టతయే కారణము. బొమ్మలను
నిజమయిన పిల్లలని యూహింతురు. ఆబొమ్మలకు ఉపచా
ముల చేయుటయందెక్కువ ఉత్సాహము. వెంద్రుకలులే
బొమ్మకంటె వెంద్రుకలున్న బొమ్మపై నెక్కుడు ప్రేమ
ఏలనన దానికి తలదువ్వుటకు అవకాశమున్నది.

ఇట్టి భ్రమకు లోనయియుండు శిశువులకు, వారాడు
కొనుచున్నవి మట్టి బొమ్మలని మనము చెప్పిన వారి కమి
మైన కోపము వచ్చును; వారి మనస్సున కెంతయో నొప్పి
కల్గును; తమ్మును తమ బొమ్మలనుగూడ దూషించినట్లు
వారు నిజముగా దలంచి యలుగుదురు. ఒకపిల్ల "కుక్కపిల్ల"
వలె నున్న కఱ్ఱబొమ్మతో ఆడుకొనుచుండ, దాని కఱ్ఱతో
జేసిరని యెవరో యనగా వినిన, దానికెంత కోపమువచ్చెనో
ఈ క్రింది పద్యము వలన తెలియును.

అమ్మ! నే నాడుకొను చిన్నమ్మతోటి,
నాదు కుక్కపిల్లను చూసి నవ్వుతుంది
కఱ్ఱముక్కలతో దీన్ని కట్టిరంట!
కుక్క కాదంట చూడవే! ఒక్కమాటు.

పిచ్చిపట్టింది కాబోలు పిల్లకిప్డు!
ఇంతమంచిది యుంటుందె యెక్కడైన?
అస్తమానము నాకేసి చూస్తు ఉంది,
కళ్ళు మూయనె మూయదు కాస్తయైన.
నేను లేకుంటె పాప మెంతేను సేపు,
గొల్లుమని యరుస్తుంది నాపిల్ల, కాదె!
బుల్లిదించక్క యీ కుక్కపిల్లనాది
లేదిలాంటిది చిన్నకు లేదు కాదె!
అమ్మ! నేనాడనింక చిన్నమ్మతోటి
కుక్కపిల్లంటె దానికి వెక్కిరింత
పట్టిలాగుతుందే దీన్ని గట్టిగాను
పాప మాకలి అవుతుంది పాలు దీని
కడుపునిండాను పొయ్యవే! కన్నతల్లి!
కఱ్ఱముక్కలతో దీన్ని కట్టిరంట,
కుక్క కాదంట చూడవే, ఒక్కమాటు;
అమ్మ నేనాడ నింక చిన్నమ్మతోటి!

పైని చెప్పబడిన యింకను కొన్ని యంశములకు ఈపద్యము దృష్టాంతముగ చెల్లును.

ఇంత భ్రమావిష్టులయి సంచరించు నవస్థయందును కొన్ని క్షణములలో బొమ్మలయందు నిర్లక్ష్యభావమును జ్ఞాపుటయును గలదు. ఆతరుణములందు బొమ్మల నెచ్చోట

నున్న నచ్చోట పారవైచి యుందురు. బొమ్మలు సజీవులు గావనియు, నాటవస్తువులనియు రానురాను శిశువు లప్పుడప్పుడు తెలిసికొందురు కాబోలు. తెలిసికొన్నను, వారీవిషయమును బాగుగ గ్రహించి యిదివఱకున్న తమయూహలను మార్చుకొనుటకు దగుకాలము కొన్ని సంవత్సరములు జరిగినగాని తటస్థించదు. శిశువులకు ప్రప్రథమమున బొమ్మలయందు పూర్ణవిశ్వాసముండును. పిదప వారనుమాన పడుచుందురు. గాని విశ్వాసమును పూర్తిగ పోగొట్టుకొనరు. సుమారు పది సంవత్సరములు గడచినపిమ్మట బొమ్మల నైజమును గ్రహించి వాని నంతగ జేర్చుకొనరు.

ప్రపంచమందలి ప్రతివస్తువునకు స్వతంత్రముగా వర్తించు శక్తిగలదనియే శిశువులయూహ. కదలుచున్న బొంగరమును ఆపుటయందు వారికుత్సాహము. ప్రాకుచున్న చీమను జూచిన దాని చలనము నాపజూతురు. కదలకుండనున్న వానిని కదప బ్రయత్నింతురు. తమ యిష్టము వచ్చినట్టుల ఇతరవస్తువులను వర్తింపజేయుటకు మిక్కిలి ప్రయత్నింతురు. అట్లు చేయగల్గిన మిక్కిలి యానందము. చేయలేకపోయిన వారు చిన్నబోయిన మోముతో నుందురు. ఇతరవస్తువులను స్వాధీనపఱచుకొనుట వారి యాశక్తి.

కొంతకాలము జరిగినపిదప ఆటలయందు తోడివారితో పందెము వేసికొని వారిని గెలుచు నుద్దేశముతో వర్తించుటకు

వారు మొదలిడుదురు. ఈయుద్దేశమయినను చాల కొలది కాలముండి, ఆట ముగియక పూర్వమే క్షీణించిపోవును. ఇద్దఱు పిల్లలు పందెము వేసికొని పరుగిడుదురు. కొంతదూర మరిగిన నొకపిల్ల వెనుకబడును. అయినను ముందుపోవుచున్న పిల్ల పోవుట మానక పరుగిడుచునే యుండును. పరుగిడుటకు గెలుచు నుద్దేశము కారణమయినను, కొంతసేప యిన పిమ్మట ఈ యుద్దేశము పోయి, పరుగిడుట కేవల ముద్దేశరహితమైన యాటగామాఱును. పందెమున గెలువవలెనన్న ఆసక్తియు పూనికయు తగ్గిపోయి ఆటగా పరుగెత్తుట యందు పూనిక హెచ్చును. ఇట్టి పూనికమూలమున తమ యవయవములను, చుట్టుప్రక్కల నుండు వస్తువులను శిశువులు స్వాధీనపఱచు కొనుచుందురు. ఇందు వారి శక్తి హెచ్చినకొలందిని నూతన వస్తువులను గూర్చి ఎక్కువగా తెలిసికొనవలెనని కుతూహలము హెచ్చును. శిశువులు జ్ఞానమును సంపాదించుటలో నిది యొక ముఖ్యమైన మార్గమని వేఱుగ చెప్పనవసరము లేదు.

ఇదివఱకు చెప్పఁబడిన యంశములఁ బట్టి శిశువులకు ఆటలెల్లపుడును ఆహ్లాదకరములుగ నుండుననియు, హాస్యోపేతములనియు తలఁచెదరేమో, అట్లుగాదు. పిల్లలకు 'బూచాడు' ఎంతభయంకరముగ నుండును! అయినను వానిని వారియాటలయందు పిల్లలు సూచించుట మానుదురా? దయ్యములు, రాక్షసులు, దొంగలు, అరణ్యము మొదలయినవి వారికి భీతిని

కలిగించును. ఇట్టివానికిని ఆటలయందు తావిత్తురు. పిల్లల యందలి భావముల నేది యెక్కువగ కదల్చి యుప్పొంగ జేయునో దానియందే వారి కాసక్తి; ఏభావము జనించినను సరియే.

అందుచేతనే దయ్యములను గూర్చి తెల్పు పుక్కిటి పురాణములందు శిశువునకు నమ్మిక యెక్కువ. ఆటయందు 'ఆవు' గా భావింపబడిన పిల్ల పొడువవచ్చిన, నాటలోనివారు నిజముగా ఆవు పొడువ వచ్చిన ఎంత భయపడుదురో, అంత భయమును పొందుదురు.

పెరుగు నమ్మువానివలె నటించుచున్న పిల్లవాడు, ఎంతయో శ్రమపడుచు, అతిజాగ్రత్తగా స్వల్పవిషయములలో గూడ వానివలెనే యాచరించుటకు బ్రయత్నించును. నెత్తిపై నున్న తట్టను పట్టుకొనుటలో నేమి, నడచుటలో నేమి, కేక వేయుటలో నేమి, ఎల్లవిషయములందును వానివలెనే చేయుట కెంతయో యోచించి వర్తించును. ఇది సులభమా? హాస్యమా? కేవల ముల్లాసదాయకమా?

పైని ఉదాహరించిన విషయము లన్నియు సామాన్యముగా ప్రతి శిశువునకును వర్తించినను, ఏయీడున శిశు వెట్టి యాటలాడు ననువిషయము దాని నైజమునుబట్టి యుండును.

శిశువుల చేష్టలందు మనకు అత్యద్భుతమును గొల్పు విషయము నొకదానిని చెప్పవలసియున్నది. కదలికగల ప్రకృతి

మందలి వస్తువులు తనవలెనే యాటలన్న కుతూహలము కల
దనియు, తన చెలికాండ్రేయనియు, తన్ను ఆడుకొనుటకు పిలు
చుచున్నవనియు భావించును. ఇట్లు భావించుట యుద్దేశపూర్వ
కముగ కాకున్నను, మనకెంత హృదయరంజకముగను, ఆశ్చ
ర్యముగను ఉండునో యించుక యోచించిన జాలును. ఈక్రింది
పద్యములు ఈ విషయమును స్పష్టపరచుచున్నవి.

అమ్మ, చూడవె ! ఆడుకొనుటకు
పిలచు చున్నవి వెళ్ళివచ్చెద.
ఆకు లల్లల లాడుచున్నవి
చేతసైగల చేయుచున్నవి॥ అమ్మ॥
పిల్లగాలులు మెల్లమెల్లన
తాకిపోవును త్వరగరెమ్మని॥ అమ్మ॥
ఆకసంబున ఆతురముగా
మెలగుచున్నది మేఘ మల్లదె ! ॥అమ్మ
చెట్టుపైనవె పిట్టలున్నవి
రమ్ము రమ్మన రవముసేయుచు॥ అమ్మ!
నాదు రాకకు నమ్మకముతో
ఎదురు చూచుచు ఇనుడు మింటను ॥ అమ్మ॥
చెఱువులోపలి చిన్నికెరటము
కదలుచున్నది ముదము జెందను॥ అమ్మ॥

ఘుమ్ము ఘుమ్మను కమ్మతావుల
పొల్పు జూపును పువ్వులెంతయొ॥ అమ్మ॥
ఇంతమందియు ఎంత సేపుగ
వేచియుండిరో ప్రేమతోడుత! ॥అమ్మ॥
వీని జేరక నేనుమాత్రము
ఇంటనుండుట ఏల అమ్మరో? ॥ అమ్మ

## గాలి

నాతోడ నాడును నన్నాడనీదు
నన్ను ముట్టుచునుండు నాకంట బడదు
చెట్లచాటున నుండి చెంతకు వచ్చి
పొద్దున లేపును ముద్దుల బెట్టు
పవళించు సమయాన పాడుచు విసరు
ఎండవేళను నైన నెగురుచు వచ్చు
నను జూచి పోవంగ కనులారగాను
వడవడ వణకుచు వానలో దడసి
వెదకుచు వచ్చును బెదరించిపోవ
మేఘాల దరుమును మెట్టలపైకి
సంతోషమును గూర్చు చాలగా నాకు
పడుచు లేచుచు వచ్చునడిరేయి నైన
భ్రాంతి పుట్టినపుడు పాపమా గాలి

గట్టిగా దానిని పట్టుకొని జూడ
మాయమైపోవును మంత్రించినటుల !

నిజముగా జరిగిన రెండుకథల నీక్రింద చెప్పుచున్నాను వానినిబట్టి శిశువులకు ఆటలయందమితకుతూహల మని తెలియవచ్చును.

అయిదు సంవత్సరముల బిడ్డ గంతులువేయుచు చెలికాండ్రతో నాడుకొనుచుండ, దానితల్లి ఆఆట తెలియమిచే అల్లరియని యుద్దేశించి, అబ్బాయీ, చూడరా, కాంతం అల్లరిచేస్తుంది'' అని తనవద్దనున్న కుమారుడు, ఇరువది సంవత్సరముల వయసు గలవానితో చెప్పెను. ఆతడు వచ్చి బిడ్డను చేయిపట్టుకొని తాను చదువుకొను గదిలోనికి తీసుకవెళ్ళి కూర్చుండబెట్టి, "ఇంక నెప్పుడయిన నల్లరిచేశావంటె గుంజీలు తీయిస్తాను, జాగ్రత. మాట్లాడకుండా ఆలాగ కూర్చో" అని చెప్పి తాను పుస్తకమును చూచుకొనుచుండెను. రెండు నిమిషములు మాత్రమట్లు కూర్చొని "అన్నా గుంజీలు తీస్తాను, వెళ్ళనిస్తావా?" అని మిక్కిలి అమాయకముగా పిల్ల అడిగెను. అన్నగారు నవ్వి, ముద్దుపెట్టుకొని, వెళ్ళి యాడుకొమ్మని బిడ్డకు సెలవిచ్చెను.

నేను నాస్నేహితులు నొకయంశమును గూర్చి చర్చించుచు గదిలో కూర్చునియుండ బిడ్డ (మూడున్నరయేండ్లది) వచ్చి అలమారులో నున్న పుస్తకాలను కదపి క్రింద వేయు

చున్నది. నేనాబిడ్డపై కొంచెము కోపపడితిని. అంత నాస్నేహితుడు నన్నుజూచి, "పిల్ల అంటే నీకు యెక్కువ గారాము. కొంచెము భయంచెప్పకపోతే నెత్తెక్కి తొక్కుతుంది" అని నన్ను నెపపెట్టినాడు. నేనాతనితో "ఏలా భయంపెట్టాలో నాకు తెలియకుండా ఉంది. నీవు కొంచెం భయంచెప్పుమా!" అని కోరితిని. అప్పుడాతడు కళ్ళుగామెడు, ముక్కుమూరెడు, మొగము బెత్తెడు చేసికొని కోపమును నటించి బిడ్డను లాగి క్రింద కూర్చుండబెట్టి చేతులు ముడిపించి "అల్లరిచేస్తే తన్నేస్తాను చూడు, కదలకుండా కూర్చో" అని ఆజ్ఞాపించినాడు. పిమ్మట మేము తిరిగి వాదములోనికి దిగితిమి. బిడ్డ చెప్పినరీతిని కూర్చున్నదేగాని దృష్టిమాత్రము అలమారు పైనే యున్నది. రెండు నిమిషములు కూర్చున్నట్లే కూర్చుని, "నాకా చిన్న పొత్తకం ఇయ్యవ్వా?" అని వ్రేలితో చూపి యడుగుచునే లేచి అలమారు వద్దకు పోయినది. తన శక్తియందు హెచ్చు నమ్మకము గలిగియుండిన నామిత్రుడును విరుగబడి నవ్వసాగెను.

---

# 3. శిశువులు - భాష.

జంతువులు భాష మూలమున తన యభిప్రాయములను ఊహలను కష్టసుఖములను ఇతరులకు తెలియజేయును. కుక్కను మనము గొట్టబోయినపుడు దానికి దప్పించుకొన్న

ఉపాయము లేనియెడల దిరుగబడి మొరుగును; అట్లుచేయుట వలన మనలభయపెట్టుటయే దానియభిప్రాయము. గ్రామాంతరము వెళ్ళి తిరిగి కొన్నిరోజులకు నింటికి వచ్చిన మనల జూచి పెంపుడుకుక్క ఎట్లు కూయుచు సన్నముగ నరచుచు తన యుల్లాసమును వెల్లడించి మనకు స్వాగతమిచ్చునో మన మెరిగినదే. పిల్లి యాకలి గొనినప్పుడొక విధముగా అరచును; ఎలుకలకై వెదకునపుడింకొకరీతి నరచును; ఇంకొక పిల్లితో కలహించునపుడు మరియొక విధముగ నరచును. ఈ యరపులే పిల్లి మాటాడు భాష; అరపు ధ్వనియే దాని మాట.

ఇంకను అల్పజీవులగు చీమ మొదలగు కొన్ని జంతువులయందు వాని శరీరముపై వెంట్రుకల వంటివి ఉండును. వాని కదల్చు విధమువలన వానియూహల నితరులకు తెలియ జేయును. పరిణామము నొందుటలో తొలిమానవులు మాటల మూలమున గాక ముఖవైఖరివలనను, నటన మూలమునను, అంగచలనము యొక్క తీరుచేతను వారిలో వారు చక్కగ వ్యవహరించుకొనెడివారు. రానురాను మానవులకు వారిలో వారికి సంపర్కము హెచ్చాయె; వ్యవహారములు పెరిగిపోయినవి. సులభముగాను, స్పష్టముగాను ఒకరితో నొకరు వ్యవహరించుటకు భాష, పదసముదాయమైన భాష, యావశ్యకత యయ్యెను. ఆ కారణమున వివిధ దేశస్థులు వివిధభాషల నేర్పరచుకొనిరి. అవయవములచే జేయగల సంజ్ఞలకంటె నివి యెక్కుడుపయోగముగ నుండుననుట నిశ్చయము.

పర దేశస్థులతో సంపర్క మెక్కువయిన కొలదియు, జ్ఞానము దినదినాభివృద్ధి యగుటచేతను ఈమధ్య అనగా పది పదునైదు సంవత్సరములలోపల మనభాషలోని కెన్ని నూతన పదములు అన్య దేశపదములు చేరినదో, పదజాలము ఎంత వృద్ధిఅయినదో చదువరులకే యెరుక.

జంతువులలో నిట్టిపదముల నుపయోగించుట యరుదు. అందు గుంపులు గుంపులుగా సంచరించువానిలో శబ్దములు ప్రయోగమునందున్నవి. కాకికి పదిపండ్రెండు శబ్దములవరకు వచ్చును: ఎప్పుడును గుంపులలో మెలగు కోతులలో సుమారు నూరుశబ్దములు ప్రయోగమునం దున్నవట !

తరతరములవారు ఉపయోగించు భాషమూలమున పెంపొందిన ఉచ్చారణ సాధనములు శిశువునందును ఉచ్చారణకు తగినవిగనే యుండును. పరిణామవాదము దీనిని సమర్థించును. ఇట్లు శబ్దోచ్చారణ శిశువునకు నైజగుణమయియున్నది.

జననమాదిగనే ధ్వనినుచ్చరించు నైజగుణమును శిశువు ఏడ్పువలన వెల్లడించును. శిశువున కేమాత్రము నొప్పి యేవిధముగ గలిగినను ఏడ్చును. మొదట కొన్నిసార్లు అది యేడ్చినపుడు తల్లి తన్నెత్తుకొని సౌఖ్యముగ నుండునట్లు చేసి తన నొప్పిని మాన్పించుటచేత తన బాధ నితరులకు తెలియజేయుటకు నేడ్చుచుండును. తొల్దొల్త శిశువు ఒకేవిధముగ నేడ్చుచుండును. పిదప ఆకలివేసినపుడొక విధమునను దేహబాధ,

కలిగినపుడింకొకవిధమునను ఇట్లు వేరుకారణములకు వేరువిధములుగ నేడ్చును. ఆయేడ్పునుబట్టి శిశువున కేమిజరిగెనో ఏమి కావలెనో బాగుగగుర్తించుశక్తి మనకుగల్గిన తెలిసికొనగలము.

ఏడ్పుతీరునుబట్టియే కాక ముఖవైఖరిని బట్టిగూడ శిశువుల భావములను గుర్తింపవచ్చును. ఎలనన ఒకటిరెండు మాసములు గడచిన శిశువు తన భావములను ప్రకటింప నేర్చియుండును. పిల్లలాడుకొను నపుడొకవిధముగ చేతులనుకాళ్ళను కదల్తురు. నొప్పిచేత ఏడ్చునపు డింకొకవిధముగ వాని నూపుదురు.

కొన్ని మాసములు గడచిన శిశువు పెద్దవారల భావములను వారి ముఖమునుబట్టి కంఠధ్వనినిబట్టి సరిగా నిర్ణయింపగల్గియుండును. ఏడ్చుచున్న 5, 6 మాసముల పిల్లవైపు చూచుచు 'ఏమమ్మా ఆకలవుతుందా, అయ్యో పాపము' అనిన చల్లగ నూరుకొనుటగలదు. వారి ముఖముపై ముఖముంచి నవ్వుచు 'ఛీ, ఛీ' యని శిశువుల నవ్వించుట మన కందరకును అనుభవమే. ముఖము ముడిచిపెట్టి కండ్ల నెఱ్ఱచేసి వారిని చూచి యరచిన యూరకున్న పిల్లయయిన నేడ్వక మానదు. తరువాత మాట నేర్చుటలో వాని నుచ్చరించునపుడు మన కంఠధ్వని ముఖవిలాసమునుబట్టి మాటల యర్థమును గ్రహించి ఆయర్థముననే వాని నుపయోగింపజూతురు.

పిల్లలకు మాటల నేర్పుటలో మనమిట్టి సరియయిన భావములు గనుపరచుట మంచిమార్గము.

రెండుమూడు మాసములు గడచిన పిమ్మటనే హల్లుల ధ్వనుల బలుకుటకు మొదలిడును. ఇంకను శిశువున కుద్దేశ మేమియు నుండదు. అవయవముల గదపుట శిశువుల నైజము కనుక కాళ్ళుచేతుల నాడించునట్లు, నాలుకను పెదవులను కదుపుటచే నేదేనిధ్వని కలుగును. అంతట శిశువున కుత్సాహము జనించి తిరుగ తిరుగ నాధ్వనినే చేయుచుండును. శిశుమానసమునుగూర్చి వ్రాయుటలో దీనిని కేవలము ఆటయనియే చెప్పవలెను. క్రమక్రమముగా ఇట్టిధ్వనులు కలుగజేయు అవయవములను అవయవభాగములను కొంతవరకు స్వాధీనము చేసికొని క్రొత్తగ వినినశబ్దముల (ధ్వనుల) నుచ్చరించుటకు సమకట్టును. ఏడెనిమిది మాసములు వచ్చినగాని శిశువిట్లు చేయజాలదు.

ఇప్పుడు శిశువు ఎదుటవారుచ్చరించు మాటలయందలి ధ్వనుల బాగుగ గుర్తించి వాటి నుచ్చరింప యత్నించును. ఇందు సులభసాధ్యములైన ధ్వనులనే పలుమారు ఉచ్చరింపవచ్చును 'తా' 'తా' 'తా' 'తా' అని పలుమా రుచ్చరించుట మన మెరుగుదుము. ఈధ్వనిని చేయగలపిల్లయూరకున్న సమయములో దానియొద్దకువెళ్ళి 'తా' 'తా' అని మనమనిన పిల్ల తిరుగ 'తా' 'తా' అని యెన్నియోసారులు అనును.

"మూపిల్ల తాత అని అంటుంది" అని జనులు సాధారణముగా తప్పు అభిప్రాయముతో అనుట వాడుకకలదు. శిశువు అనినది 'తా' 'తా' ఇంతియే. ఈరెండును కలిపిన 'తాత' అవుననియు 'తాత' అనుపదము ఒక నామమనియు శిశువున కెంతమాత్రమును తెలియదు. 'తా' 'తా' అను నవి శిశువున కేమియు నర్థము నీయవు; కనుక ఏయర్థముతోగాని దానిని శిశువు ప్రయోగించి యుండదు.

శిశువులు ధ్వనులుచేయునపుడు హల్లులను శక్తికొలది ఒత్తిపలుకుటయు, ఆధ్వనులలో వారిభావములఁజొప్పించుటయు గలదు. 'త' అని పలుకుటకు మారు, ఒక్కొక్కసారి, 'త' అని పలుకుదురు. దానివిని , శిశువు 'అత్త' యనుచున్నదని దాని అత్తలనుకొని యానందించి ముద్దాడుదురు.

ధ్వనులను వాని యర్థము నుద్దేశించి పలుకుటకు బూర్వమే యితరులుపలుకు శబ్దములయర్థము గ్రహించుశక్తి శిశువునకుండును. శిశువు బుగ్గను ముద్దాడినవెంటనే దాని నోటివద్ద మనబుగ్గనుబెట్టి 'ముద్దాడుఅమ్మా, ముద్దాడు అని కొన్నిసారులు నేర్పిన అది ముద్దాడుట నేర్చికొని, ఇకముందు ఎప్పుడు ముద్దాడమనినను అది ముద్దాడగలిగి యుండును. 'దాయి' 'దాయి' అని మనము పిలిచినపుడు, చేయచాచి వేళ్ళతో తాను పిలువవలెనని మన యభిప్రాయమైనట్లు గ్రహించి తోడనే తానట్లు చేయును. పిల్లలకు మాటలు రాక

పూర్వమే 'తారంగం' అమ్మా, 'తారంగం' ఏనుగమ్మా యేనుగ' 'గుమ్మాడమ్మా గుమ్మాడి' అనినపాటలు పాడుచు పిల్లలనాడించుట మన మెరిగినదే. కొంత యలవడిన పిమ్మట, ఈపాటలను ప్రారంభించినతోడనే శిశువులు ఉచితరీతిని ఆడుదురు. మన యుద్దేశ్యములను మనమా ఆడుమాటలవలన గ్రహించు శక్తి మాటలు రాకపూర్వమే వారికిగలదు.

కాని శిశువుల గ్రహణశక్తికి మేరగలదు. అందు లోపములును గలవు; అది సంపూర్ణమని చెప్పుట కేమాత్ర మును వీలులేదు. గిన్నెతో పాలను తెచ్చి శిశువునకు బోసిన తరువాత గిన్నెను చూపి 'గిన్నె ఇదిగో' అని చెప్పినపిమ్మట గిన్నె యేదియనిన శిశువు గిన్నెవైపు చూపును. తల్లిచేతిలో గిన్నె యున్నపుడే దానిని శిశువు గుర్తించి మన మడుగు ప్రశ్నను గ్రహింపగలదు. ఇంకొకరు ఆగిన్నెను చేతబట్టుకొని 'గిన్నె యేదీ' అనిన శిశువు కేమియు దోచదు. అనగా మొదట యేపరిస్థితుల మధ్యను ఒకవస్తువును చూచునో ఆ పరిస్థితుల మూలముననే ఆవస్తువును గ్రహింపగలదు. ఇట్టి పరిస్థితుల సమూహములను బట్టి శిశువు ఇతరవస్తువులనుగూడ గ్రహింప గలదు. మాటలను గ్రహించలేనికాలమున పరిస్థితులను బట్టి వస్తువులను ఆనవాలు పట్టెయుండుసరికి కొంతవరకు శిశువు తనశక్తిని వృద్ధిపరచుకొని యుండును. భాషాజ్ఞానమును సంపాదించుటలో శిశువు ఒకమెట్టు గడచెనని చెప్పవచ్చును.

రెండవ మెట్టును జేరినప్పుడు వస్తువు నామమునుగూడ పరిస్థితులతో గలిపి వాని నన్నింటిని ఒకేసారి గ్రహించును. ఈపరిస్థితులు సమూహామందేదయిన నొకవేళ లోపించిన యెడల శిశువున కెంతయో కష్టముగనుండి అది ఏడువసాగును. ఇప్పుడు మనము శిశువులకు నేర్పుమాటలను మనము లేనప్పుడును వారిలో వారే ఉచ్చరించుకొందురు. ఇట్లు మనల ననుసరించి మాట్లాడుచు వచ్చిన కొంతకాలమునకు పరిస్థితులతోపాటు అర్థమును గ్రహించుట క్రమముగ మాని వేసి శబ్దమును అదినిరూపించు వస్తువుతో గలిపి గ్రహించుసామర్థ్యము వచ్చును. "దాయిదాయి" "అమ్మమ్మ" "తా, తా" మొదలగు ఒకటియేయగు భావములుగల మాటల నెక్కువ చులుకుగా గ్రహింపగలదు. ఈ మాటలను తెలియబడు వానిని చూచుట తోడనే శిశు వామాటల నుచ్చరింపగలిగి యుండును.

తన చుట్టుప్రక్కలనున్న మనుజు లెట్లు మాటలమూలమున భావప్రకటనము చేసి వ్యవహరించుదురో శిశువులు చూడ జూడ వారికి ననుసరణశక్తి ప్రబలి ఆమాటల నుపయోగింప యత్నించుచుందురు. పిల్లి "మేవ్ మేవ్" అని యరచుట శిశువు నాకర్షించును. తరువాత పిల్లి నెప్పుడుచూచినను "మేవ్ మేవ్" అని దాని గుర్తించి దాని నా పేరుతోనే గ్రహించును కాని "పిల్లి, పిల్లి" అని పెద్దవారు ఆజంతువుననుట గ్రహించి తానును "పిల్లి" అను మాటనువాడుచుండును. తనయింట

నున్న వారు మాటాడుభాషనే శిశువులు అనుసరణచేతను అల
వాటుచేతను నేర్చుకొందురు. చెవిటిశిశువులిట్లు భాషను విను
టకు శక్తినొందియుండరు గనుక వారికి భాష యలవడుట
మిక్కిలి కష్టము.

ప్రపంచ వ్యవహారములందు భాషయొక్క యావశ్యక
తనుగనిపెట్టి దాని నెట్లు పూర్వులు వాడుకలోనికి దెచ్చిరో
యావిధముననే శిశువును తాను లోకమునందలి వస్తువులను
గూర్చి నేర్చుకొనుటకునుతన సౌకర్యములనేర్పఱచు కొనుట
లోను, తనకు కావలసినదాని నడిగి తీసుకొనుటకును భాష
యావశ్యకమయి యుండును. అవయవములచే జేయు సంజ్ఞలు
తృప్తికరముగా నుండవు. శిశువునకు; ఒకమూలకొన్ని వస్తువు
లున్నవి. అందొకటి శిశువులకు గావలసియుండిన, మాటలు
రాకపోవుటచే వ్రేలితోనాదెస దానినిజూపి తలనూపుచు అది
తనకుగావలెనని సంజ్ఞజేయును. అప్పుడు శిశువునకు గావలసిన
వస్తువు నిచ్చిన సరియే;లేకున్ననది యేడ్చును. ఆమూలనే
యున్న వస్తువులలో నొకదానివెంబడి నొకదానిని శిశువునకు
జూపవలసియుండును; అందు తాను కోరినవస్తువును చూపిన
పుడు ఏడ్పునుమానును. ఇంతఆలశ్యమును శిశువు సైపలేదు.
అందుచే మాటలనేర్చుట దానికెంతయు అవసరము. కొన్ని
మాటలను నేర్చినపిల్లతనకు కావసినవస్తువును పేరుతో నొత్తి
చెప్పి ముఖ లక్షణములవల్లను దాని సూచించును. అవయవ
ములను శక్తికొలది చూపుటయుగలదు.

వస్తువులపేళ్ళను కొన్నింటి నేర్చినప్పటికిని, ఆయావస్తువుల ప్రత్యేకగుణములను లక్షణములను గుర్తింపక, శిశువు వానిమూలమున దనయందు జనించు భావములతోనే వాని పేళ్ళకు సంబంధ ముందుననుకొనును; బెల్లము అను పేరు నేర్చిన పిల్లకురుచిగలపదార్థమును దేనినిచ్చినను అదబెల్లమే యనుసూహను బొంది ఆపేరుతోనే వానినెల్ల బిలచును, తరువాత బెల్లముయొక్క రుచి తీపి అను పేరు నేర్చిన పిమ్మట 'జంతికను, ఇచ్చి దానిని శిశువుతినినతరువాత 'ఇదిఎలాఉందిఅని అడిగిన తియ్యగాఉంది' అనిగాని 'తియ్య' 'తియ్య' అనిగాని అది చెప్పును. ఇంటిలో 'అప్పచ్చులు' చేసిన రోజున సుమారు మూడు సంవత్సరముల పిల్ల 'అప్పచ్చి' ఏం!' అని తల్లినడిగినది. ఈరోజు పండుగ అని ఆమె సమాధానము చెప్పెను. మరు సటి దినమునుండి 'అప్పచ్చులు' చేసినప్రతిదినమునను 'పండుగ' యనుచుండెను. ఇంకొక చిత్రము. తనకు అప్పచ్చుల మీద కోరిక గలిగినపుడు 'అమ్మా' పండుగ కాదూ ?' అని తల్లిని అడుగుచుండును. తాను క్రొత్త యంగీని తొడుగుకొనినపుడెల్ల పండుగయే! తనకు హృద్యముగ నుండునది యెల్ల పండుగయేయయినది. పిల్లి పిల్లలు సంతోషముగా ఆడుకొనుచుండుట చూచి యెంతో ఆతురతతో ఇంటనున్న వారందరితోను 'చూడు' 'చూడు' పండుగ' అని చెప్పి యంతో ఆర్భాటము గావించెను !

పదార్థములందు సామాన్యగుణములను, అవి కలిగించు భానములను వీనిని బాగుగ గుర్తించి వానిని తరగతులుగ విభజించు శక్తి కలుగును.

ఒక వస్తువుయొక్క ప్రత్యేక లక్షణమునుగూడ గుర్తించి దానిని పేరుతో పిలచుటకు దగిన విచక్షణశక్తి నెలలు గడచిన కొలది పట్టువడును. తన తండ్రినిచూచి యాతని గుర్తించి 'నాన్న' యని పిలుచును. ఏడాదిమాత్రము గడచిన పిల్ల ఆకలయినపుడు తన 'బుల్లికంచము' చేతీసి దానిముందర కూర్చొనును. ఇట్లు గుర్తించు శక్తి చాలనపుడు శిశువులు పొరబడుటయు గలదు. పినతండ్రిని చూచి పొరబాటున 'నాన్న' అని పిలచుటయు, ఒక్కొకప్పుడు గలదు. అప్పుడు దగ్గర నున్నవారు 'నాన్న కాదు' 'చిన్నాన్న' అని తప్పులు దిద్దుదురు. ఇదేవిధమున మన శిశువులకు బోధించవలెనను ఉద్దేశము లేకయే బోధించుచుందుము; లక్షణములందు స్వల్పభేదములను గూడ వారు గుర్తించగలుగు శక్తి నిచ్చుచున్నాము. మొదట శిశువుల నందరిని 'పాపాయి' అనే పిలచును. ఈ యవస్థయందు సామాన్యగుణమునే గుర్తించును; పిమ్మట ఆపాపాయిల సరియయిన పేళ్ళను తెలిసికొనును. వారియందలి ప్రత్యేక లక్షణములను గూడ గుర్తించును.

వివిధవస్తువులందలి ప్రత్యేక లక్షణముల నెఱుగు సామర్థ్యమలవడినతోడనె ఆయా లక్షణములుగల వస్తువు

కన్నింటికిని సంబంధమూహించి యొక్క తరగతిగా వారిని జేర్చుచుండుటకు శిశువూహించును. ఇట్టి శక్తి కలిగిన కొలది శిశు తెలుగు పదజాలము ఎక్కువగును. ఇట్టిశక్తి శిశుమానస వృత్తిపై నెంతియో ప్రభావము జూపుచుండును. గులాబీ, మందార, గన్నేరు, నిత్యమల్లి, దేవదార, ఈ పువ్వులన్నియు ఎఱుపువర్ణము గలవనియే వారి యభిప్రాయము. పిమ్మట వీని యందలి భేదముల నేర్చికొందురు. మొదట సాధారణముగా శిశువులు మొగ్గలను, రేకులను, కాడను, తొడిమ వీనినన్నిటిని పువ్వులనియే యనుకొందురు. లోకానుభవములో నితరులతో సంపర్కము గలుగుకొలది వానినన్నిటి వేఱుపరచును; వేఱ్వేరు పేర్లను నేర్చుకొనును. మనమాడుకొను మాటలను మన ప్రక్కనున్న శిశువులు మనకు తెలియకుండగనే నేర్చుకుందురు; వానియర్థము స్పష్టముగా తెలియకున్నను పదములతో సంతుష్టి పొందుదురు. ఒకమారు కోపమువచ్చి నౌకరును 'గూస్' అంటిని. శిశువు నాప్రక్కను అప్పుడున్నది కాబోలు. మరియొక అరగంటకు 'గూస్' గూస్, అని ఆ శిశువు తనబొమ్మను అనుచుండెను. ఇంతమాత్రమున 'గూస్' అనుపదమున కర్థము తెలియునని మన మనుకొన గూడదు. అర్థము తెలికపోయినను సందర్భానుసరణముగ వానిని ప్రయోగింతురు. శిశువులు; కనుక శిశువులయొద్ద మాట్లాడునప్పుడు చెడ్డమాటల నెంతమాత్రము పలుకరాదు.

శిశువులు పదములను సరియయిన యర్థమును తగు సందర్భమున నుపయోగించుటలో వారిమనస్సు కొన్ని యవస్థలగుండ మారుచుండవలెను. మొదట వస్తువును చూచిన దానిపేరు స్ఫురించును. ఆ పేరును పలుకునపుడు ఆ వస్తువు యొక్క రూపము దానిమనసు ఎదుట నుండునని మనము తలపవచ్చును. మ్యావ్, అనుదానిని ఇంటనున్న తెల్లపిల్లి పేరని శిశువు తలంచును; తరువాత ఏరంగు పిల్లి కనబడినను 'మ్యావ్' అనును. ముందు 'మ్యావ్' అను ధ్వని శిశువునకు తెలియజేయునది యిప్పుడు మారిపోవును. ఈపదము అలవడిన పిమ్మట పిల్లియొక్క యాకారము నెంతమాత్రమును మనస్సునకు తెచ్చుకొనకయే దానిని సరిగా వాడుచుందురు; పరులు వాడిన సులభముగ నిట్లే గ్రహింతురు.

తొలియవస్థలో నొకశిశువు తనకు కనబడిన జంతువుల నన్నియు, తువ్వాయి, (ఆవు) అనిపిలిచెడిది. 'తువ్వాయికి' నాల్గుకాళ్లుండును. కనుక నాల్గుకాళ్లున్నవన్నియు, 'తువ్వాయి'లు అని శిశువు తలంచుటయం దాశ్చర్యమేమియు లేదు. శిశువు యొక్క మానసము పెంపునొందుటలో నిదియొక యవస్థయని గ్రహింపనగును. శిశువు ఒకపదమును తప్పుగ ప్రయోగించిన 'ఆపదము కాదు. ఈపదము' అని దానిని సవరించి నేర్పుచుందుము. మనము వాడుచుండు భాషను వినినకొలదియు పద ప్రయోగముసకు దనంతట నదియే శిశువు అలవడును. తాను ఇతరు

లతో సంపర్కము గలుగజేసికొనకనుండ లేదు; కనుక ఇతరులు వాడురీతినే పదములవాడుట శిశువున కావశ్యకతయయి యుండును. పరులపద్ధతుల ననుసరించు నైజము శిశువు కెక్కువగ నుండుట భాషాజ్ఞాన సంపాదనమందు తోడ్పడును. ఈ కారణముచేత శిశువు మిక్కిలి చురుకుగా భాషను నేర్చుకొనగలదు.

ఇట్లు పదములను వాని ప్రయోగమును నేర్చుకొనుట శిశువులకు సులభమని తలంపరాదు. వారెన్నియో పాట్లుపడుదురు. వారి కృషియందు మిక్కిలి నవ్వు పుట్టించునట్లు వారు పదములను ప్రయోగింతురు. శిశువులు చూచువస్తువులనేకములుండును. వారెరిగిన పదములు కొన్ని మాత్రమే. పేరులు తెలియని వస్తువునకును, పేరులు తెలిసిన వస్తువునకును కొంచెము పోలికయున్నను కనిపెట్టి తెలిసియున్న పేరుతో మొదటి దానిని పిలుతురు. "నానా, నేను కొత్తపాకినీ (పరికిణీ) తొడుక్కున్నా, నువ్వూ కొత్తపాకినీ తొడుక్కో" అన్నదిపిల్ల. శిశువుభాషలో అందరు వేసికొనుచున్నలును 'పాకినీలే' పెనసలు, కలము, బలపము, సుద్దకణిక, ఇట్టి వ్రాయుసాధనముల నన్నింటిని ఒకే పేరుతో పిలుచును; వానిలో మొదట ఏపేరు నేర్చుకొనునో దానిని మిగిలిన వానికిని వర్తింపజేయును. బేడకాసును 'బుల్లి రూపాయి పాప రూపాయి' అని పిలిచి, రూపాయికిని బేడకాసునకునుగల పరిమాణమునందలి తారతమ్యమును సూచించును. ఒకపిల్ల పేరంటమునకు బోయి, చేతి పసుపు బట్టుకువచ్చినది.

ఇదియేమి అని దానినడిగిన 'ఇది పేరంటం' అని బదులు చెప్పెను. శిశువు మనస్సునందు పేరంటమునకును, అచ్చట ఇచ్చు పసుపునకును, ఎక్కువ సంబంధ మున్నట్లు తోచును.

"నిన్న, రేపు, కొనుట, అమ్మట, వచ్చుట, వెళ్ళుట" ఇట్టి పదములలో ఒక పదమునకు మారు రెండవదాని నుప యోగింతురు శిశువులు. శిశువు ఒకరాతిని ఎత్తవలెననిచూచి నది; కానిదాని నెత్తలేక పోయెను. వెంటనేదానిని 'మొద్దు రాయి' అని విసుగుకొనెను. ఒక నున్నటి రాతిపై తాను కొబ్బరి ఉంగరముఅరుగదీసికొనుచుండెడిది; ఆ రాయి శిశుభాషయందు ఉంగరం రాయి' అయ్యెను. ఒకసారి శిశువు కాల్వలో పడవపై ప్రయాణము చేయుట తటస్థించెను; అప్పుడు శిశువు దానిని 'కాలవిల్లు' అని పేరుపెట్టి 'బుడ్డగది' 'పడకగది' 'నాన్నకచ్చేరీ గది' ఇవి యన్నియేవి" అని వరుసగా నడిగెను. ఇట్టి పేర్లు ఎంతవరకు ఉచితముగ నుండునో శిశువులతో సంపర్కముగల వారికి తెలియకపోదు. వర్షము కురిసిన పిమ్మట కప్పలు బెక బెకలాడుట తరుచు వినిన శిశువు వర్షము వచ్చుటచూచి "బెక బెక" బెక బెక అదిగో" అని తల్లికి చూపి చెప్పెను.

మానవులలోని సంబంధములను అచేతన పదార్థములందును ఆరోపించుదురు. కొందఱు శిశువులు ఒకపిల్లకు 'వంకాయ పేరుమాత్రమే తెలియును. ఒకనాడు సంతనుండి కూరలను తెచ్చిసావిటిలో మూటబోసి యుంచితిని. ఆపిల్ల కూరలమొద్దకు

బోయి పెద్ద ఆనపకాయలను తీసి గోడకు జేరగిలవేసి నిలువ బెట్టెను. దాని ప్రక్కను వంకాయను దోసకాయను పెట్టియుంచెను. అప్పుడు నేవెళ్ళి ‹అదియేమిటిఅట్లా పెట్టినావు; అనిఅడుగగా ‹ఇది వంకాయ; ఇది వంకాయ తల్లి,ఇది అమ్మమ్మ,అని వరుసగా వంకాయను, దోసకాయను,ఆనపకాయను చూపెను. మానవులకు గల బాంధవ్యమును ఇతరజంతువులలోను కల్పించి శిశుగీతముల పాడుట మనగృహముల సామాన్యమే. ఇవిశిశువుల కెంతయో సంతోషమును కల్గించును. అందొకటిచిక్కడ వ్రాయుచున్నాను.

కప్ప నీ అప్ప
బల్లి నీ బావ
బొమ్మ నీ అమ్మ
చీమ నీ చెల్లెలు
తొండ నీ తోడికోడలు

ఇవి యర్థములేని పాట లయినప్పటికిని (Nonsense Rhymes) పిల్లలకు వీని వలన కలుగు ఉత్సాహమును బట్టి సారస్వతమందు వీని కుచితమైన స్థానముగలదు.

తన్ను సంరక్షణచేయు వారందరును తనకు అమ్మలే యని ఒకశిశువు అభిప్రాయపడి ‹బాయిఅమ్మ, ‹బువ్వఅమ్మ, అని పాలిచ్చుతల్లిని బువ్వపెట్టు పినతల్లిని పిలిచెడిది. మేము కాపురమున్న యింటిలో నిక రెండు కుటుంబములవారు

కాపురముండిరి. అందొకకుటుంబములోని యామె తరుచు శిశువునకు 'అప్పచ్చి' పెట్టుచుండెడిది. ఈమెను శిశువు 'అప్పచ్చి అత్త' అని పిలచెడిది. రెండవ కుటుంబములోని యామెకు పాపాయి యున్నది; కనుక ఈమెకు 'పాపాయత్త' అను నామ ముంచినది.

ఒక శిశువును నిద్రపుచ్చుటకు దానితల్లి 'గండుపిల్లి వస్తుందమ్మా! నిద్రపో' అని భయపెట్టుచుండెను. ఒకనాడు నేను పొరుగూరునుండి వచ్చిన స్నేహితునితో భోజనము చేయుచుండ ఆపిల్ల మారాము చేయగా నేను నా స్నేహితుని చూపి "అదిగో! బూచాడు అల్లరిచేస్తే ఎత్తుకుపోతాడు" అంటిని. పిల్ల తన పెంకితనమునాపి, "బూచాడా? గండు బూచాడా? అని ప్రశ్నించెను. ఆస్నేహితుడు మాయింట కొన్ని దినములుంట తటస్థించెను; ఇన్నిరోజులను బిడ్డ ఆయనను గండు బూచాడనియే పిలుచుచుండెడిది. ఆయన బిడ్డయందు వాత్సల్యము చూపుచుండుటచే ఈశబ్దమునందలి యర్థము భయంకరముగాక యుత్సాహకరముగా నుండెను. ఇట్లు కొంతకాలము జరుగ మాయింటికి వచ్చుచుండు వారిలో కొందరు పెద్దవాండ్రుకూడ ఆయనను ఈనామముతోనే హాస్యమునకై పిలుచుచుండిరి. ఆబిడ్డ తన చెలికాండ్రకు ఈయననుచూపి గండుబూచాడు అని చెప్పెడిది. ఇట్లు భాషను కూర్చుట యందును బిడ్డలు తమ నైపుణ్యమును జూపుచుందురు,

మాటలు రాని యిద్దరు శిశువుల నొకచో నుంచిన వారిద్దరును కొన్ని ధ్వనులను గుర్తులుగా జేసికొని వారియభిప్రాయముల నొండొరులకు దెలుపుచు నాడుకొందురు. మూడునాల్గు వత్సరములు పిల్లలయినను వారాడుకొనునపుడు కొన్ని మాటల కల్పించి వాడుచుందురు. ఆవశ్యకతయే వారిట్లు చేయుటకు కారణమయి యుండును. ఇంటనున్న వారు మాతృభాష నొల్లక కొందరు పిల్లలు మాటను తమంతట తాము కల్పింతురు.

శిశువులు పదముల నుచ్చరించుటను గూర్చిన విషయముల గొన్నింటి చెప్పవలసి యున్నది. శిరము, గొంతుక వీనియందలి కండరములు కదలుటచే ఉచ్చారణ సాధ్యమగుచున్నది. ఏయే కండరములు కదలునో, ఏతీరున అవి యెంతవరకు కదలునో యను అంశములబట్టి ఉచ్చరింపబడు ధ్వని యుండును. కనుక ఉచ్చారణ క్రమముగ నుండుటకు శిశువునకు ఆయా కండరములు స్వాధీనమున నుండవలెను. శిశువు వానిని స్వాధీనము చేసికొనుటకు కొంతకాలము పట్టును. ఆ కారణముననే పదముల నుచ్చరింప గల్గుటకు పూర్వమే ధ్వనులు గ్రహింపగలదు. కండరముల సులభముగ కదల్చుటచే గల్గు ధ్వనులను శిశువు మొదట నుచ్చరించుచుండును. కష్టసాధ్యమని యే ధ్వనినిగాని యుచ్చరింప ప్రయత్నించుట మానకుండును. ర, డ మొదలయిన ధ్వనుల నుచ్చరింపలేవు. శిశువులు త, ప అనువానిని కూడ పదప్రారంభముననున్నచో

పలుకుట కష్టమే. అందుచేతనే 'అత్త' 'అప్ప' అని సులభమయిన ధ్వనిని ముందుచేర్చి యుచ్చరింతురు. అక్షరముల పలుకుట యందు శిశువులు వేర్వేరు రీతుల జూపుదురు. ఒక యక్షరమును పలుకుటలోని కష్టము, దాని ప్రక్క యక్షరముల స్వభావమునుబట్టి కూడ ఉండును. అక్షరసముదాయమును పదములుగ నుచ్చరించుటలో శిశువు లనేక విధములుగా పాటుపడుదురు. అక్షరములవరుసను మార్చుచుందురు; కొన్ని యక్షరముల వదలివేతురు; ఒక్కొకప్పుడు కష్టమైన ధ్వనులకు మారుగ సులభమయిన ధ్వనులను ఉచ్చరింతురు. ఇంకొక విశేషము కూడ గలదు. క్రొత్తపదమును సంపాదించినతోడనే దాని ధ్వనిని బట్టి తామిదివఱకెఱిగియున్న పదములతో జేర్చి జ్ఞప్తియందుంచుకొందురు. అందుచేతనే శిశువులు నూతన పదమును గ్రహించుశక్తి ఇదివరకు పరిచితములైన పద సముదాయమును బట్టి యుండును.

ఈక్రింది పట్టీవలన పై జెప్పిన విషయము లుదాహరింపబడినవి.

| మాట | శిశువు ఉచ్చరించునది. |
|---|---|
| లాంతరు | తీంతరు |
| రోకలి | లోకలి |
| వెండిగిన్నె | ఎండిగిన్నె |
| తమలపాకు | తాంపాకు |

| | |
|---|---|
| కంబళీ | కమ్లీ |
| పటికిబెల్లం | కటికబెల్లం |
| అట్ట | అత్త |
| సీనా | చీచా |
| సీటు | పీత |
| పుస్తకము | పుత్తకం |
| పులుసు | పుస్సు |
| వేపాకు | యేపాకు |
| పెనసలు | పెస్సలు మొ॥ |

ఒకశిశువు ఉచ్చరించిన మాదిరియే ఇందు ఉదహరింపబడెను. శిశువు లందరును ఇట్లే ఉచ్చరింతురని చెప్పుటకు వీలులేదు. ఏ యీడున శిశువులిట్లు ఉచ్చరింతురనునది వారి వారి పరిస్థితుల బట్టియు నైజమును బట్టియు నుండును.

రెండు సంవత్సరములు దాటువరకును శిశువులంతగ మాటల నేర్చియుండరు. 20,30 పదములమాత్రె ముచ్చరింపగలరేమో. మూడు నాల్గు సంవత్సరములలో నత్యద్భుత వేగముతో నాల్గయిదువందల మాటలవరకును స్వీకరింతురు. ఎప్పుడును ఒంటరిగ నాడుకొను శిశువు ఎక్కువగ మాటల నేర్చుకొనలేదు. తనకంటె నెక్కువ వయసు గలవారితో ఎప్పుడును కూడియుండు శిశువు లతివేగముగ మాటల పట్టుకొందురు. పరిస్థితులనుబట్టియేకాక శిశువుయొక్క ఆరోగ్యము,

నేర్చుకొనుటకు కుతూహలము, వస్తువులను వాని గుణములను పరీక్షించుటలో ఆశక్తి వీనిబట్టికూడ చాలవరకు ఉండును.

అన్ని భాషాభాగములలోను నామవాచకములనెక్కువగ గ్రహింతురని మనకు సామాన్యముగాగల యభిప్రాయము అనుభవమువలన సరిగాదని తెలియుచున్నది. భాషను నేర్చుకొనుటలో మొదట నామవాచకములతో ప్రారంభించుట శిశువుల పట్ల కొంతవరకు నిజమై యుండవచ్చును; కాని శిశువులకు ఏదేని పనినిచేయుటయందు వాసక్తి యెక్కువగ నుండుటచే వారు క్రియాపదములనే ఎక్కువగా నేర్చియుండుట సహజము. ఈలక్షణమే అనుభవము వలనగూడ స్థిరపడుచున్నది. ఇతర భాషాభాగములో చేరిన పదములను నేర్చుటలోగూడ వానిని క్రియలకు బదులుగనే యుపయోగింతురు. మేడమీదికి తీసుకొనివెళ్లుమని యడుగుటకు శిశువు "మీద, మీద" అనుచుండెను. ఇక్కడ "మీద" అనుశబ్దము క్రియవలనే ఉపయోగింతురు. ప్రతిపదమును, నామవాచకము సహా, శిశువు ఒక పనితో దృఢమైన సంబంధమును గలుగజేసి, క్రియావాచకముగనేదానిభావించి నేర్చుకొని తిరుగునట్లే దాని నుపయోగించును.

వాక్యముచే మనముస్పష్టపరచు అభిప్రాయములనుఒక్క మాటతోనే శిశువు తెలియజేయనెంచును. 'జో' 'జో' అని అనుటలో తన్ను ఉయ్యెలయందుంచి ఊచవలెనని యభిప్రా-

యము. పిమ్మట రెండుమూడు పదముల జేర్చి తనయుద్దేశమును వెల్లడింపజూచును; ఇంకను తన అవయవముచే కొన్ని సంజ్ఞల గూడ జేయును. "నాన్న, తియ్య, లే" అని మూడు పదములను కలిపి నాన్న మిఠాయి తేలేదని తల్లితో చెప్పును. శిశువుల యోచనలు, చిత్తవృత్తులు, వీనిని కొంతవరకు ఎరిగినగాని వారి భాషను తెలిసికొనలేరు. రాను రాను వారు అభినయము కనిపెట్టి దానికి బదులు మాటలనే ఉపయోగింతురు. వస్తువులయందును, వానిలో వానికి గల సంబంధములను గుర్తెరిగి వానిని విచక్షణాభ చేసి విభజించుటకు శక్తి గలిగిన కొలది మాటలను పొందికచేసి వాక్యరూపమున తమ యూహల తెలియజేయుట వారికి సాధ్యమగును. వేర్వేరు రీతుల సంబంధముల తెలియజేయుటలో వేర్వేరు భాషా భాగముల నుపయోగించి వాక్యమును కూర్పగలుగుచుందురు. వస్తు క్రియాపరిచయములతో పాటు జ్ఞానాభివృద్ధియు భాషాభివృద్ధియు కలుగును. వ్యాకరణయుక్తముగా పదముల వరుస కయి లక్ష్యపెట్టక దానికి క్రియయొక్క యే విషయములు ముందు తట్టునో వానినే ముందు తెలియపరతురు.

శిశువొక భావమును చెప్పునపుడు దాని వ్యతిరేకభావమును గూడ కలిపి ఏకవాక్యమున చెప్పుచుండుట గలదు. "నాకించక్క మిఠాయి ఉంది; అమ్మకి లేదు." అన్నది; ఒక పిల్ల తండ్రితో. "నాకెన్ని అప్పచ్చులో; నీకొక టేయని" చెలి

కాంక్ష నాక్షేపించె నొకసారి. "తాతకి మీసాలున్నాయి; నాకు లేవు" అని చిన్న పిల్లయొకతె తండ్రితో ఫిర్యాదు చేసినది. స్త్రీలతోనె చాల నెలలు మెలగిన పిల్ల మొగవారితో గూడ 'ఇది ఇయ్యవే, ఇలా రావే' అని మాట్లాడును.

చిన్నపిల్ల కొంతకాలము గడచిన పిదపగాని తన్ను గూర్చి మాట్లాడునపుడు "నేను" అనదు; అందరును తన్ను ఎట్లు పిలతురో అట్లే తనను గూర్చి తాను చెప్పును. "చిట్టికి పప్పులు కావాలి" అని అడిగింది చిట్టి యను పేరుగల పిల్ల. "నా బొమ్మ ఏదీ?" అనుటకు "చిట్టిది బొమ్మ ఏదీ?" అనును. "చిట్టిని ఏడుస్తూంది చూడూ;" అని యరచెను; "చిట్టిని ఏడ్పించును చూడూ!" అనుటకు బదులు.

ఒక్కొకప్పుడు వాడుక భాషలో నున్నట్టి పదములను వారంతటవారే కూర్తురు "వర్షము పోయింది" అందురు. "వర్షము వెలసింది" అనుటకు. "సూనె ఒలికిపోయింది" అనుటకు "పారిపోయింది" అందురు. నాల్గుసారులు పిలచినను తల్లి వినిపించుకొనక పోవుటను చూచి ఒకపిల్ల "నీకు చెవులు కనపడవా?" అని యడిగెను. పొయ్యిమీదనున్న పాత్రచుట్టు పొగ గ్రమ్ముటను చూచి "బువ్వని పొగమింగివేస్తూంది" అని తల్లితో యరచిచెప్పెను.

'కండచీమవలె ఈపిల్లకు బెల్లమంటే యిష్టం' అనెను ఇంట్లో ఉన్న తాతగారు శిశువును ఆదినము మొదలుకొన్ని రోజులవరకు ఆపిల్ల అందరిని 'కండచీమ' యనియే పిలచుచుండెను.

"అయ్యో! మాణిక్యంలాటిసూది పారేసావే!" అని తల్లి తనపిల్లపై విసుగుకొనెను. అదిజ్ఞప్తియుంచుకొనిబడిలో ఉపాధ్యాయుడు 'మాణిక్యమునుఎఱుగుదురా! అని పిల్లల నడగగా ఆపిల్ల 'మాణిక్యంసూదిలాగుంటుంది' అనిబదులుచెప్పెను.

'కొత్తపల్లి' యన్న గ్రామముయొక్క పేరు వినగానే ఒకపిల్లవాడు "కొత్తపిల్లి పాతపిల్లి" అని పలుమారుఅనసాగెను.

'ఈపప్పాలుదీసికెళ్ళిపిట్టితో ఆడుకో' అనెనుతల్లితనపిల్లను వెంటనే యెంతో కోపముతో "పప్పాల్తో ఆడుకోం! పప్పాలు పెట్టి చిన్నమ్మతోటివాళ్ళతోటీఆడుకుంటా" అని తల్లివాక్యమును సవరించెను.

శిశువులతో నెక్కువగా కలుగజేసికొనిన కొలదియిట్టి యుదాహరణ లింకను పొందుపరుప వచ్చును. దీనినిగురించి యాలోచించుకొలది శిశువులు మనము సామాన్యముగా ననుకొనుపాటి బుద్ధిహీనులు కారని తోపక మానదు.

---

## 4. శిశుసంరక్షణము.

మన దేశమున ప్రసవము స్త్రీలకొక గొప్పగండముగా పరిగణింపబడుచున్నది. ప్రసవావేదనము దుర్భరమగుటయు, బహు కష్టము మీాద ప్రసవించుటయు, పిమ్మట తల్లియు శిశువు అనేక వ్యాధులపాలయి తరుచుగా మృతినొందుటయు

తటస్థించుచున్నది. ఇతర దేశములతో పోల్చిచూడ మన దేశమందు శిశుమరణము మిక్కుటముగా ప్రబలియుండుట స్పష్టమగును. ఇట్టి విచారకరమగు దేశస్థితికి హేతువుల నరసిన నవి రెండుగా కాన్పించును.

గర్భిణిస్త్రీలు గమనింపవలసిన ఆరోగ్యవిధానమును, ప్రసవానంతరము శిశువును కాపాడు విధులను, పిమ్మట శిశుపోషణోచిత మార్గములను, మన దేశీయులు గ్రహింపలేదు. ప్రజాభివృద్ధికిని అందుపై నాధారపడియున్న దేశక్షేమమునకును మూలమగు నిట్టి ప్రాముఖ్య విషయమున నజ్ఞానులుగా నుండుట కడు దుఃఖకరము. శాస్త్రపరిజ్ఞానము లేకయే మంత్రసానులుగా వ్యవహరించుచున్న మూఢులిట్టి స్థితిని మరింత పాడుబరచు చున్నారు. దొరతనమువారు మనల నీదుస్థితినుండి తప్పించుటకై ప్రసవాలయముల స్థాపించినారు. మంత్రసానితనమునకు అత్యవసరమగు శాస్త్రజ్ఞానమును అనుభవ సహితముగా నొసంగు సౌకర్యముల నేర్పరచియున్నారు. ఇట్టి మహోపకార బుద్ధితో నెంతయో ద్రవ్యము దొరతనమువారు వెచ్చించుచున్నప్పటికి మూలలనున్న పల్లెటూళ్ళ ప్రజలు వీని లాభములింకను పొందలేకున్నారు. అయినను సాధారణముగా ప్రసవపు సందర్భమున గలుగుచున్న ఇక్కట్లపాల్పడకుండ జేయు సూక్ష్మసూత్రముల జనసామాన్యమందు ప్రచారము చేయుటకు దొరతనమువారు మిగుల శ్రద్ధవహించి యున్నారు.

మన దేశమందు స్త్రీలలో విద్యావ్యాప్తి తక్కువగా నుండుటచే శిశుసంరక్షణ విధానమున వారు అజ్ఞానమున బడి యుండి దేహారోగ్యమునకును ప్రాణాపాయమునకును లోనగు చున్నారు. అదియునుగాక స్త్రీశక్తి విషయములందైనను మనలో స్వాతంత్ర్యమీయకుండుట కడు శోచనీయము. పరిశుభ్రమైన గాలి పీల్చుకొనుటకు విహారము సల్పుటకైన వారు నోచుకొనలేదు. తల్లుల ఆరోగ్యసౌఖ్యములే. శిశువుల ఆరోగ్య సౌఖ్యములకు మూలకారణము లనునదిగూడ గ్రహింపకున్నవారు స్త్రీలలో లనేకులున్నారు. పసిపాపల నరయుపట్ల స్త్రీలు గమనించవలయుసూత్రముల బోధించి వారి యజ్ఞానమును బాపి ప్రసవమునకును శిశుసంరక్షణము నకును తోడ్పడు సౌకర్యముల నేర్పరచుట దొరతనము వారితో బాటు ప్రతిమానవునివిధియై యున్నది.

ఈవిషయమున గొంత జ్ఞానము గల్గిన స్త్రీ పురుషులు గూడ అజాగ్రతచే నిర్లక్ష్యముచే వారికి తెలిసిన విధానముల నవలంబింపక తెలియని వారితో సరిసమాను లగుచున్నారు. ద్రవ్యము కొరకు భూసంపాదన కొరకు పగదీర్చుకొనుటకు అధికారస్వీకారమునకు ఎన్నిపాట్లనో పడుటకు వెనుదీయరు గాని కుటుంబవృద్ధికిని దేశక్షేమమునకును ఆధారమైన శిశురక్షణకై స్వల్పద్రవ్యమైన ఖర్చుపెట్టుటకు చేతులు రావు. "చంటిబిడ్డయే యింటిదైవము"; కనుక శిశువునెడ నిర్లక్ష్యముజూపి తగుశ్రద్ధ,

తీసికొనకుండుట మహాపాతకమని వేఱుగ చెప్పవలెనా ? శిశురక్షణ విధానమును ఆచరణలోనికి దెచ్చినచో వారిబిడ్డలు బాగుండుటయేగాక తెలియని జనులకు వస్తుపాఠమును బోధించి వారినుద్ధరించినవారగుదురు. ఇంతియే గాక అవకాశము గలిగినపుడెల్ల మనకు తెలిసిన యంశములను ప్రచారముచేయుట ధర్మము. ఇట్లుచేసిన కొలదికాలములో జనసామాన్యమునకీవిషయముల చక్కని ప్రబోధము కలిగి శిశువులయెడల వారు జాగ్రతవహించి శిశుమరణమును వారింప సమర్థులగుదురు.

స్త్రీలకు ప్రసవమన్న గండము; తొలి కానుపున స్త్రీలుమరింత భయపడెదరు. దేహారోగ్యమునకు వలయు ప్రతి యవయవ భాగచలనముపైనను మనస్సునకింతంతయన రాని ప్రభావముండుటచేత, భయపీడితురాండ్రగు స్త్రీలు శరీరారోగ్యమును కోల్పోయి, రోజుల కొలది కష్టపడినగాని ప్రసవము కాలేరు. అనారోగ్యమగు పరిస్థితులలో నుండు వారెట్లు రోగముచే బాధపడుదురో అట్లే రోగియగు మాతగర్భమున పెరిగిన శిశువును అనేక వ్యాధుల పాలగును. ప్రసవమునకు భయపడుటకూడదు; అవసరమును లేదు. ప్రతి సంవత్సరము లక్షలకొలది శిశువులు జన్మించుచున్నారు. శిశువులును, తల్లులును ఆరోగ్యము గలిగి సుఖముగానున్నారు. వలయు నియమములు తెలిసికొని వానినిబట్టి

జాగ్రతగా నడుచుకొనిన స్త్రీ ప్రసవమునకు భయపడుటకు మారుగ శుభప్రదమైన పండుగగా గణించి సంతసింపగలరు.

తల్లి ఆరోగ్యముగ నుండినగాని శిశువు దృఢముగానుండుట సంభవముకాదు. గర్భము దాల్చినది మొదలు తన ఆరోగ్యమును వృద్ధిచేసికొనుటకు తల్లి శక్తి కొలది ప్రయత్నింపవలెను. తల్లి బలముగా నుండుటకు తగినంత ఆహారమును తినవలెను. సామాన్యముగా తినునట్టి పదార్థములనే పుచ్చుకొనవలెను. గర్భిణీస్త్రీలకు "సూడిద" యని ముచ్చటగా సంగ్రహకములు వంటకములు సమర్పించుట మనలో వాడుక. గర్భవతులు మాత్రము వీటి నెక్కువగా తినరాదు. మాలిన్యరహితముగా నుండునవియు, సులభముగా జీర్ణమగునవియు, నిలువయుండనవియు నగు పదార్థముల పుచ్చుకొనవచ్చును. అన్నము, పాలు, కాయగూరలు తినవచ్చును. మాంసము, పప్పాదినునులను చాల మితముగా భుజింపవలెను. పండ్లు తినుట మంచిది; కాని మాగిన వాటిని కుళ్లిన వాటిని ముట్టరాదు.

మసాలదినుసులు జీర్ణకోశమున కుద్రేకము కల్గించును గాన కూడవు. గర్భవతుల జీర్ణకోశముపై పిండమువలన కొంత ఒత్తుడి యుండును. కాన వారికి జీర్ణశక్తి తక్కువ. ప్రతిదినము సకాలమునకు మలవిసర్జన మగుచుండనిచో వైద్యసహాయము నొందుట మంచిది. శరీరమునకు పడని వస్తువుల

వర్జింపవలెను. ఈ సమయమున భోజనముపట్ల మితత్వమును ఖండితముగా గమనింపవలయును.

మనలో జరుగుబాటుగల వారిండ్లలో గర్భవతుల నతిగారాబముగా చూచుచు వారిచే సేవనియు చేయించకుండ సోమరితనమును అలవాటు చేయుట సాధారణముగా జరుగుచున్నది. అవయవముల కదలికచే తగినంత దేహపరిశ్రమ లేకపోవుట వలన జీర్ణశక్తి క్షీణించి వివిధరోగములు జనించును. ఉచితజ్ఞతలేక మూఢప్రేమచే చేయు నీసోమరితనమును యలవాటు తుదకు ప్రాణాపాయమును కలిగించును. గర్భవతులకు తగు మాత్రము దేహపరిశ్రమ యుండి తీరవలెను. ఇంటిలో కిటికీల బాగుగా తెరచిన పరిశుభ్రమయిన గాలి వెలుతురు ధారాళముగా గృహములోనికి వచ్చును. అట్టి స్థలమున మామూలు గృహకృత్యముల దీర్చుట గర్భవతులకు తగిన పరిశ్రమ యగును. కడుపులోని శిశువునకును పెరుగుటకు మంచిరక్తము కావలసియుండుటచేత గర్భవతులకు ఇతరులకంటె ఎక్కువ పరిశుభ్రమైన వాయువు అవసరము. అందుచే వీరు దినమున కొకటి రెండు గంటలయినను ఇంటి బయట పరిశుభ్రమైన వాయుప్రచారముగల మైదానమున విహరించుట మంచిది. కావలసినంత శుభ్రవాయువు వెలుతురు తగు మాత్రము ఇంటిపని యున్నచో గర్భవతులకు చికిత్సావశ్యకత యుండనే యుండదు.

ఇక మనదేశములో పొట్టకూటికిగాను ఉదయమునుండి సాయంకాలమువరకు పాటుపడవలసిన కష్టజీవులనేకులున్నారు. వీరిలో గర్భవతులు ప్రసవసమయమువరకును కాయకష్టము బడుచునే యుండవలసివచ్చుచున్నది. తల్లికుండు దార్ఢ్యములో కొంత భాగము శిశువునకుగాను వినియోగింపబడవలసి యుండునుగాన శరీరదార్ఢ్యము నంతను హీనకృత్యములలో గోల్పోయిన గర్భవతులకు దుర్బలులగు శిశువులు గలుగుదురు. మితిమీరినంత కష్టపడినను మితిమీరినంత కాలము శ్రమపడినను గర్భవతులు వ్యాధిగ్రస్తులై దుర్బలులైన సంతానమునకు సిద్ధపడవలసి యుండును. ప్రసవమునకు పూర్వమొక మాసము రోజులు గర్భిణీస్త్రీ విశ్రాంతి తీసికొనుట శ్రేయోదాయకము. జీవనోపాధిలేని స్త్రీలకిట్టి విశ్రాంతి చేకూరుట యసంభవముగా తోచును; కాని ప్రతిమానవుని యారోగ్యముపైనను సంఘక్షేమ మాధారపడియున్నది. కావున గర్భవతిని ఆమాసములో భరించు బాధ్యత సాంఘికులది. గ్రామస్థుల చందాల వలన కొంత సొమ్ము జమచేసి యుంచుండి నిరుపేదలగు గర్భిణీస్త్రీలకు సాయముచేయుట వారివిధిగా భావించవలెను.

ప్రసవమునకు పూర్వమొక మాసము బరువుపనుల నేమియు చేయరాదు; బరువైన పిల్లలనైన ఎత్తుకొనరాదు. భావోద్రేకము కలిగించు వార్తలు గర్భవతుల చెవిని బడరాదు. వారిమనస్సు నిర్మలముగా సంచలనము లేకుండ నుండ

వలెను. అట్లు కానిచో నెలలు నిండక పూర్వమే ప్రసవమగుటయు ఒక్కొక్కప్పుడు మాతాశిశువుల ప్రాణముల కపాయము కలుగ వచ్చును.

దేహము విశ్రాంతిని కోరునప్పుడు నిద్రించవలెను. నిదుర సౌకర్యములను, విశ్రాంతిని ఇచ్చుటయేగాక దేహమునకు బలముగూడ కలిగించును. నిదురించునప్పుడు పిల్లల యల్లరి వలనను పనిమీద దృష్టిచేతను కలతనొందరాదు. ధారాళముగా గాలివచ్చుతావుననే నిదురించవలెనను మాట మరువరాదు. గదిలోపల పరున్నయెడల కిటికీలను పూర్తిగా తెరచి యుంచుటవసరము. గర్భవతులెంత నిద్రపోయినను పోవచ్చును. శుభ్రమైనగాలి వీచుతావునను మాత్రము నిద్రపోవలెను.

"పారిశుద్ధ్యము ప్రాణంబు ప్రాణమునకు" అపరిశుభ్రత వలన నితరులకంటె గర్భవతుల కెక్కుడు కీడు సంభవించును. కనుక గర్భవతులు దేహమును బట్టలను సదా పరిశుభ్రముగా నుండునట్లు చేసికొనవలయును. ప్రతి దినమును శుభ్రముగా దేహమును తోముకొని గోరువెచ్చని నీట స్నానముచేయుట కర్తవ్యము. ఏదినమున కాదినము ఉతికినబట్టలనే ధరించవలెను. ప్రసవమున స్త్రీలపండ్లకు జబ్బుకలుగుటయు ముక్కలుముక్కలుగా నూడిపోవుటయు పిప్పిపన్ను అగుటయు తటస్థించుకొను. కొందరికి పండ్లు ఊడిపోవుటయుఅనుభవములోని దే. పండ్లజబ్బునకు కారణము గర్భవతులజీర్ణకోశము సరియైనస్థితిలోనుండక

అనేక పులుపుస్రవములు జీర్ణకోశములోనికి ప్రవహించుటయే. ఈద్రవముతే పండ్లపై పూసియుండును. పండ్లను దినమునకనేక సారులు శుభ్రముగా తోముకొని కడిగినయెడల అవి పరిశుభ్రముగాను బలిష్ఠముగాను ఉండి ఊడిపోనేరవు.

ఈ నియమముల ననుసరించిన గర్భవతి బలమును ఆరోగ్యమునుగల శిశువును గాంచ తొందరపడుచుండును. కాని యొక సంగతి ఆమె మరచియున్నది. శిశువునకు పాలు కుడుపుటను గూర్చి యోచించినదా? లేతనోటితో శిశువు పాలు గుడువవలసినపుడు చనుమొనలు మృదువుగా నుండవలదా? మార్దవముగా లేని చనుమొనల శిశువు కుడిచిన అవి పెట్లి తల్లికి నొప్పి కల్గించవా? కనుక జాగ్రత! ప్రసవమునకు పూర్వమే కొలదిరోజులు చనులకును మొనలకును వేసెలైనుగాని (Vaseline) ఆముదముగాని రుద్దిన వాని పై చర్మము మెత్తబడగలదు.

ఇక పురిటింటిని సిదపగచవలెను గదా!

ఇంటిలో అనవసరము యేమూలనున్న చిన్న గదినో అందున్న చెత్తనుతీసి పురిటిగదిగా నుపయోగించుట మంచిదిగాదు. శిశువుండుగది చుట్టుప్రక్కలు ఎంత పరిశుభ్రముగా నున్నను చాలదనియే చెప్పవచ్చును. పురిటిగది విశాలముగాను గాలి ధారాళముగా ప్రవహించుటకును వెలుతురు వచ్చుటకును తగిన సౌకర్యములుకలిగి తేమలేకుండ నుండవలెను. గాలిలో ననేక

సూక్ష్మజీవులు గలవు. ఇవి కంటికగపడవుగాని వీనిసామర్థ్య మాశ్చర్యము కలిగించును. ఇందు కొన్ని అపాయకరములగునవి కలవు. చెత్త, మురికి మొదలగు వాని నాశ్రయించుకొని అందు నివాస మేర్పరచుకొని యుండును. వయసుగలిగి బలమైన శరీర ముగలవారు వీని అపాయమునుండి కొంతవరకు తప్పించుకొన గలరు గాని అప్పుడు పుట్టిన శిశువు వీని ధాటికను చాలలేక పోవును. కనుక పురిటిగదిలో ఇసుమంతయైన చెత్తలేకుండ చేసి గోడలకు సున్నము కొట్టించవలెను. ప్రసవము కొలది సేపటికి కలుగుననగా గదిని శుభ్రముగా తుడిచి కడిగి ఆరబెట్టి యుంచవలెను. పురిటి మంచము గుడ్డలు నిర్మలముగా నుండ వలెను.

ప్రసవమునకు ముందుగ వేడిపాలుగాని యితర ఆహార ముగాని తల్లికి యివ్వవలెను. దార్ఢ్యము లేకున్న సుఖప్రసవము కలుగదు.

మన దేశమున తెలివైన మంత్రసానులు దొరకుట కష్టము. గర్భిణీస్త్రీకి ఏమాత్రము వ్యాధియున్నట్లు అనుమానముగా నున్నను వైద్యుని సలహాతీసికొనుట క్షేమదాయకము. మంత్రి సాని దేహము బట్టలు బహు శుభ్రముగా నుండవలెను. ఆమెచే స్నానముచేయించి, శుభ్రమైన బట్టల కట్టజేసినగాని ఆమెను పురిటిల్లు ప్రవేశింప నీయరాదు. పురిటిలో స్త్రీలకు వచ్చు సన్నిపాత జ్వరమునకు సూక్ష్మజీవులే కారణము. సన్నిపాత

జ్వరము కలిగిన స్త్రీగల పురిటింటినుండి వచ్చిన మంత్రసాని మూలమున ఆజ్వరము ఇతర పురిటిళ్ళలో ప్రవేశించును. మంత్రసాని పరిశుభ్రముగానుండుట యత్యావశ్యకము. మంత్రసాని చేతులు కడుగుకొనుటకు సబ్బునీరు ఆగదిలోనే యుంచవలెను.

శిశువు ఉచ్ఛ్వసించుట తోడనే దానిని కప్పుటకు శుభ్రమయిన కంబళీ జాగ్రత్త పెట్టవలెను. పాతకంబళీయయినను నష్టములేదుగాని అదిశుభ్రముగానుండవలయును. శిశువునుస్నానమాడించుటకు కావలసినవిసిద్ధపఱచి యుంచవలెను. శుచియైన పొడిగుడ్డలను శిశువునకై పదిల పఱచవలెను.

తల్లిప్రక్కనే శిశువెల్లప్పుడు పరుండియుండుట మంచిదికాదు; అది అనారోగ్యమునకు హేతువగును. ఒకప్పుడు ప్రమాదవశమున నిద్రలోతల్లి దొర్లి శిశువుపైబడి శిశువునకపాయము కలిగించుట తటస్థించును. కనుక శిశువునకుప్రత్యేకముగ మంచమునేర్పాటు చేయవలెను. శిశువు తన దగ్గరగానుండవలెనని తల్లికి కోరికయున్న, శిశువునకు వెదురు పేళ్ళతో పొట్టిప్రక్కలు గల మంచమును గాని తొట్టెనుగాని చేయించి యుంచుకొననగును.

పుట్టిన తోడనే శిశువును భూమిపై చిన్న గుడ్డమీద పరుండబెట్టి యుంచుట మనలోజరుగుచున్నది. ఇట్టి స్థితిలో శిశువు దేహమునకు చలిగాలి సోకి అనేక వ్యాధులు గలిగించును. తల్లి గర్భమున వెచ్చగా నున్నశిశువు ప్రపంచమందలి

నూతన పరిస్థితులకు క్రమక్రమముగ అలవాటుపడవలెను. కనుక జన్మించుట తోడనే శిశువును శుభ్రమైన పొడికంబళిలో పొదివి పెట్టవలెను. శిశువును ఇటులుంచిన యెడల స్నానము చేయించుట కొంత యాలస్యమైనను ఇబ్బందిలేదు.

శిశువు పుట్టగనే సన్నని శుభ్రమయిన మెత్తనిగుడ్డతో శిశువుకండ్లపై జాగ్రత్తగా తుడువవలెను. గర్భమునుండి వెలువడు మార్గములోనుండు ద్రవము శిశువుల కండ్లలో పడును ఈద్రవమందు సూక్ష్మజీవులతో గూడిన మాలిన్యమున్నచో శిశువుల కండ్లకు జబ్బుకలుగును. క్రమముగా కండ్లు పోవుట గూడసంభవించును. ఇట్టి స్వల్ప యుపచారలోపము వలన పసితనముననే అనేకులు గ్రుడ్డివారగు చున్నారు.

శిశువు దేహముపై మాలిన్యము సులభముగా పోవుటకు గాను వంటినిండ ఆముదమును రుద్ది పిమ్మట సబ్బుతో గాని మెత్తని సున్నిపిండితో గాని తోమిస్నానము చేయించవలెను. ఆముదము రుద్దనియెడల మాలిన్యము పోవుటకై శిశువు దేహమునకు నొప్పి పుట్టునట్లు తోమవలసివచ్చును. అట్లుతోమినను మురికి పూర్తిగా పోనేరదు. చల్లని గాలి వీచు తావున శిశువును స్నానము చేయించరాదని తల్లులు సదాజ్ఞప్తియందుంచుకొనవలయును. స్నానము చేయించుటలో మొదట కండ్లను ముఖమును కడిగి తుడువవలెను. పిమ్మట తలనుతోమి తుడిచి

యుంచవలెను. తరువాత దేహమును స్నానముచేయించవలెను. స్నానానంతరము దేహమున యేమాత్రము తేమయులేకుండు నట్లుచక్కగా శిశువును తుడువవలయును. స్నానమునకుపూర్వ మెన్నడును శిశువుల కాహారమియ్యరాదు. బిడ్డశరీరముకంటె కొంచెము వేడిగానుండు నీటస్నానము చేయించవలెను. ఊపిరి తిరుగకుండునట్లు నీటిని శిశువుపై పోయరాదు.

శిశువునకు తల్లిపాలను పీల్చుకొను వరకు ఏఆహార మును మందును ఈయరాదు. కొందరుశిశువులు తల్లిపాలను పుట్టిన కొన్ని గంటలకుగాని కుడువరు. అయినను ఇబ్బంది లేదు. పాలు త్రాగుటలేదని ఆవుపాలను, ఆముదమును త్రాగించకూడదు. తల్లిపాలె బిడ్డకు సరియైన ఆహారము, ఔషధము. తల్లిపాలలో సుఖవిరేచనము గావించు గుణము గలదు. మూడవరోజువరకు సరిగాపాలు త్రాగకున్నను భయపడ నవసరములేదు; శిశువు కొంత ఆకలిగానుండు టయే మంచిది. ఔషధము ఆవుపాలు మొదలయిన ఆహార ముతో శిశువు జీర్ణశక్తిని పాడుచేయకుండ తల్లి పాలవలననే శిశువు ఆహారమును పొందునట్లు చేయుట శిశువున కెంతయు శ్రేయము.

శిశువు నొప్పికలుగకుండు తావున సౌఖ్యముగనిద్రింప నిమ్ము. దినమునకు 22 గంటలు శిశువునిదురపోవును. పగలు రెండు గంటల కొకసారియు, రాత్రివేళ మూడుగంటల కొక

సారియు బిడ్డకుపాలుకుడుపవలెను. ఏడ్చినపుడెల్లనుపాలనీయక సరియైన వేళలనే యివ్వవలెను.

తమ బాధలను భావములను కోరికలను విశదపరుపలేని నోరెరుగని శిశువుల పోషించు భారము పూర్తిగ తల్లులదై యున్నది. తనంతట తాను ఉపచారము చేసికొనుటకు శిశువునకు బొత్తిగా శక్తిచాలదు. శిశువులయభివృద్ధి తల్లుల సంరక్షణావిధానము ననుసరించి యుండును. కనుక శిశువులనెట్లు సంరక్షించిపోషింపవలెనో తల్లులు తెలిసికొనుట ముఖ్యావసరము.

శిశువుల ఎముకలు దార్ఢ్యములేక కొంత మెత్తగనుండును. క్రమక్రమముగా దినములు గడచిన కొలది యవి దృఢపడును. మెత్తగానుండు శిశువుల ఎముకలు ఎట్లు వంచిన నట్లు వంగి యుండగలవి గాన శిశువు దేహమును వంకర టింకరలగా నుండు స్థితిలోనుంచిన, ఆవంకరలే పెద్దఅయినపుడు స్థిరముగా నిలిచి అంగవికారమును కలిగించును. శిశువును తిన్నగా పరుండబెట్టియే యుంచవలెను. వచ్చినవారందరును శిశువును ముద్దుగా ఎత్తుకొనుచుండుట మనలో ఆచారము. ఎత్తుకొనవలయు విధానమెరుగని వారనేకులుందురు. అట్టివారు శిశువునెత్తుకొనిన వెనుపూసలు యథాస్థానమును తొలగుటయు వంగిపోవుటయు సంభవించి శిశువునకు గూని యేర్పడును. శిశువు నెత్తిపై మాడు అతి సున్నితముగా నుండును. ఇచ్చట ఎముక కప్పియుండకపోవుటచే ఇచ్చట యేమాత్రము ఒత్తిడి కలుగ

కూడదు. "మాడు" క్రిందనే మెదడు ఉండుటచేతను మెద డుస కపాయము కలిగిన ప్రాణము పోవుననియు గుర్తించి, మాడుపట్టున నేమాత్రము ఒత్తిడి లేకుండ చూచుచు తరుచు ఈ స్థలమున నూనె పూయుచుండవలెను.

శిశువుల యభిప్రాయములను కష్టసుఖములను వారి యేడ్పువలన తెలిసికొనవచ్చును; కాని ఇట్లు సరిగా తెలిసికొను టకు తల్లులకు తెలివితేటలును అనుభవ జ్ఞానమును ఉండ వలెను. శిశువు యేడ్చినప్పుడు దానికి ఆహారము కావలెననియు లేక రోగము కలిగినదనియు సాధారణముగా తలంచు చున్నారు. "బాలానాం రోదనంబలం." సుఖముగా నున్న బిడ్డలు వారి అవయవముల పెంపుజేసికొనుటకు యేడ్చుటవస రము. ఆకలి అయినప్పుడు హీనస్వరముతో ప్రారంభించి కొంతసేపటికి పెద్దపెట్టున యేడ్చుదురు. వ్రేళ్ళను చప్పరించు కొనుటవలన కూడ శిశువులు ఆకలి గొనినట్లు గ్రహించ వచ్చును. అజీర్తి బాధవలన కూడ బిడ్డలు యేడ్చుచుందురు. ఆహారమిచ్చి యెంతసేపయినదియు కనిపెట్టి ఆకలి యేడుపో అజీర్తి యేడుపో నిర్ధారణ చేసికొనవలెను. నొప్పి కల్గినపుడు చేతుల ముడుచుకొని గిలగిల యేడ్చును. పరుండియున్న శిశు వును తాకిన ఒకప్పుడు యేడ్చును. అందు నిట్టి శిశువునకు సౌఖ్యముగా లేదని గ్రహించి ప్రక్కను సరిగా దులిపివేసి తిరిగి పరుండబెట్టవలెను. అదే రీతిగ చాలసేపు యేడ్చినను,

తల నిటునటు త్రిప్పికొనుచు హీనస్వరముతో నేడ్చినను, శిశువు అనారోగ్యముగానున్నదని గ్రహించి వెంటనే వైద్యుని పిలువనంపి చికిత్స చేయించవలెను.

శిశువుల ఆరోగ్య లక్షణములను వ్యాధి లక్షణములను గుర్తించు తెలివి తల్లులకుండవలెను. ఆరోగ్యముగానున్న బిడ్డ క్రమముగా బరువు వృద్ధిపొందును. మెల్లగా ఊపిరి విడచును. నెమ్మదిగా నిదిరించును. ఇష్టముగా ఆహారము పుచ్చుకొనును. పసుపుపచ్చగా రోజుకు రెండు మూడు సారులు మలవిసర్జనము చేయును; అట్టి శిశువు చర్మము మెత్తగను, కొంచెము వెచ్చగను తడిగాను ఉండును.

బిడ్డ క్షీణించుచున్నను, వాంతులు విరేచనములు, మలబద్ధము మొదలగు వ్యాధులు కల్గినను వెంటనే వైద్యుని సహాయము కోరవలెను. నోటితో శ్వాసవిడచుట, నిద్రలో ఉలికిపడి కాలు సేతులను తన్నుకొనుట; బిడ్డదేహమున, ముఖ్యముగా తలపైన చెమటపట్టుట, దేహమందలి మాంసము కదలుచుండుట ఇవి వ్యాధి లక్షణములు గాన, వీనిలో నేదైన శిశువునెడ కాన్పించిన ఆలస్యము చేయకుండ చికిత్స చేయించవలయును.

అనుదినము ఉదయమున శిశువున కాహార మిడక పూర్వముగాని, సాయంకాలము పరుండబెట్టుటకు పూర్వము గాని స్నానము చేయించవలెను. స్నానము చేయించుటలో

పైన నొకచో నుదహరించిన రీతిని గమనించవలయును.
ఆహారమిడిన తోడనే శిశువున కెప్పుడు నీళ్ళు పోయరాదు.
నీళ్ళు పోయునప్పుడెల్లను ముందుగ కళ్ళను కడిగి శుభ్రపరచ
వలెను. వ్రేలునకు శుభ్రమైన గుడ్డపీలిక చుట్టుకొని దానితో
శిశువు నోటిని శుభ్రముచేయుటయు, నిర్మలమైన గుడ్డను చేసి
దానితో ముక్కులోను (ఇంకొక పీలికతో) చెవిలోను తిరి
పెట్టుట జరుపవలెను. ఒక్కొక ముక్కు రంధ్రమునకును,
చెవికిని, కంటికిని వేర్వేరు గుడ్డపీలికలు నుపయోగించి,
పిమ్మట ఆపీలికల పారవేయవలెను కాని తిరిగి ఉపయోగించ
రాదు. శిశువు తలపై పచ్చని పొట్టు (చుండు) ఉన్నటు
లనుమానమున్న రాత్రి తలకు బాగుగా నూనె పూసి స్నాన
మయిన పిమ్మట పొట్టు ఊడిపోవునట్లు కుంచెతో మెల్లగా
రాయవలెను. చుండు అంతయు పోవువరకు ప్రతిదినము ఇట్లే
చేయుట మంచిది.

తల్లిపాలే శిశువునకు దైవ మేర్పరచిన యాహారము.
శిశువునకు ఆరోగ్యముగా పెరుగుటకు వలయు పదార్థము
లన్నియు సరియైన పాళ్ళుగా తల్లిపాలలో నున్నవి. మన దేశ
మందు సామాన్యజనులలో దాయీలచే పాలనిప్పించు
దురాచారము లేకుంట కొంత యదృష్టమే. ఆవుపాలు కొంత
సేపటికి పులిసిపోవును. తల్లి పాలు చెడిపోకుండును. తల్లి
పాలచే పెరిగిన బిడ్డ బలము గలిగి ఆరోగ్యముగా నుండును.

బిడ్డ యేడ్చినపుడెల్ల పాలియ్యక పగలు రెండేసి గంటలకును రాత్రి మూడేసి గంటలకును ఇవ్వవలెను. రాత్రిపూట పాలిచ్చుటలో వ్యవధి యెక్కువయినను ప్రమాదములేదు. వేళ పట్టున పాలీయకుండ ఇష్టమువచ్చినపుడెల్ల యిచ్చుచుండిన శిశువు జీర్ణశక్తి చెడిపోవును. పగలు బిడ్డ నిద్రించుచున్నను వేళకు లేపి పాలియ్యవలెను. ఒక స్తనములోని పాలు పూర్తిగ అయ్యేవరకు ఆ స్తనమునే కుడుప వలెను. పాలు కొంచెముగా నున్నయెడల మార్చి మార్చి యివ్వవచ్చును. తల్లి ఆరోగ్యముగా నున్నగాని ఆమె పాలు ఆరోగ్యకరముగా నుండవు. కనుక తల్లి తన ఆరోగ్యమును తన క్షేమము కొరకే గాక పిల్లల క్షేమము కొరకు కూడ కాపాడుకొనవలెను. తల్లి రోగములు పాలమూలమున శిశువునకు వ్యాపించును. గనుక తల్లి వ్యాధిగ్రస్తురాలుగా నున్నప్పుడు ఆమె పాలను శిశువు త్రాగుట హానికరము. ఒక సంవత్సరము గడచిన శిశువునకు స్తన్యపాన మీయరాదు. అప్పటికి బలమైన ఆహారము శిశువున కవసరము. బలము నిచ్చునవియు, సులభముగా జీర్ణమగునవియు అగు ఆహారపదార్థముల నీవయసున శిశువునకియ్యవలెను. ఎప్పుడైన నియమిత కాలముననే ఆహారమీయవలెను. ఆహారముల మధ్య వ్యవధి నెక్కువ చేయవచ్చును.

అప్పుడు పితికిన ఆవుపాలలో దుమ్ము ఈగలు యేమియు.

పడకుండ చూచి బాగుగా కాచి త్వరగా చల్లారబెట్టి స్తన్య పానము మానిన బిడ్డలకు నీయవచ్చును.

సరియైన ఆహారమును సరియైన వేళల నీయకపోవుటచే బిడ్డలకు విరేచనములు, వాంతులు; బాలరోగము మొదలయిన వ్యాధులు పుట్టుచున్నవి. ఎండకాలములోను, జ్వరము తగిలి నప్పుడును, బిడ్డకు దాహామగునుగాన శుభ్రమైన పాత్రిలో బాగుగ కాచి చల్లారబెట్టిన నీటిని ఆహారమునకును ఆహారము నకును మధ్య నిచ్చుచుండవలెను.

శిశువు శరీరమును వెచ్చని బట్టతో కప్పవలెను. రక్తములోని ఉష్ణమును కాపాడుటకిది యవసరము. శిశువు నకు సౌఖ్యముగా నుండుటకును, శరీరాభివృద్ధికి వలయు అవ యవ సంచలనమున కాటంకము లేకుండునట్లును, మెత్తని తేలికయైన బట్టలనే శిశువును కప్పుట కుపయోగించవలెను.

శిశువులు సుఖముగా నిరాటంకముగా నిద్రించుట కేర్పాటు చేయవలెను. శిశువునకు ప్రత్యేకము చిన్న మంచ ముండుట మంచిది. మెత్తని గుడ్డలతో దానిపై పరుపు నమర్చవచ్చును. ఈగలు, దోమలు బాధింపకుండ మంచము నకు సన్నని గుడ్డ తెర వేయవలెను. ఊయలలో నుంచి ఊపుచు శిశువును నిదుర బుచ్చుట మంచి యలవాటుకాదు. ఊపుటకు అలవాటుపడిన శిశువు ఊపకుండిన నిదురపోనేరదు; నిదుర లేకున్న అనారోగ్యము కలుగునని చెప్పనవసరము లేదు.

శిశువు నెల్లవేళల పరిశుభ్రమైన తావుననే యుంచుట చాలా ముఖ్యము. ధారాళముగా వీచు శుచియైన గాలి శిశువున కత్యావసరము. తేమస్థలము చలిగాలి ఇవి సాధారణముగా మన శిశువులకు కలుగు రొంపకు కారణములు. రొంప కలిగినపుడు ఆముదమును త్రాగించుట ముఖ్యము. విరేచనములచే బాధపడు శిశువులకును ఆముదము మేలు చేయగలదు.

పై విషయములగ్రహించివానిబట్టిశిశువులయెడవర్తించినచో మన దేశమందు ప్రబలియున్న శిశుమరణమును నివారించుటయేగాక ఆరోగ్యవంతులై శరీర దార్ఢ్యముగల ప్రజలు వెలయుటకు వీలుకలిగించిన వారమగుదుము.